Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 40 • 28-9-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# అగ్నిపర్వతం బ్రద్ధలౌతుందా?

తెలంగాణ విషయంలో కాంగ్రెస్ అధిష్టానం వైఖరి స్పష్టమైపోయింది. రెండేళ్ల క్రితం డిసెంబర్ 9తేది నాటి ప్రకటనలో జరిగిన పొరపాటు మరొకసారి పునరావృతం కాకుండా జాగ్రత్త పడుతున్నదని తెలిసిపోతున్నది. తెలంగాణ కోసం కాంగ్రెస్ మీద స్వంత పార్టీలోనే విపరీతమైన ఒత్తిడి వుంది. రాష్ట్ర ఏర్పాటు జరగకుండా రేపు 2014 ఎన్నికలకు వెళ్తే, ఆ ప్రాంతంలో వున్న 119 శాసనసభా స్థానాలలో, 17 ఎమ్పీ సీట్లలో ఒక్కటంటే ఒక్కటి కూడా గెల్చుకొనే అవకాశం వుండదని కాంగ్రెస్ వాదులు నెత్తీనోరు బాదుకొని మరీ కేంద్ర నాయకత్వానికి విన్నవిస్తున్నారు. అయినా సరే సోనియాగాంధీ ఈ విషయంలో ఏ మాత్రం తొందరపాటు చూపడం లేదు. ఆచి తూచి వ్యవహరించడానికే మొగ్గు చూపుతున్నారు.

తెలంగాణ రాజకీయ జెఎసి తలపెట్టిన సెప్టెంబర్ 30 కవాతు నాటికి కేంద్రం నుంచి తెలంగాణ సానుకూల ప్రకటన తెప్పిస్తానని భీషణ ప్రతిజ్ఞ చేసి, నెల రోజులుగా ఢిల్లీలో మకాం పెట్టి వున్న టిఆర్ఎస్ అధినేత కెసిఆర్‌కు ఇది దిమ్మతిరిగే దెబ్బ. తెలంగాణ ఉద్యమానికి సంకేతం కెసిఆర్ అన్న సంగతి లోకానికంతా తెలుసు. కానీ ఏ కారణం వల్లనో ఆయన కొంతకాలంగా ఉద్యమాన్ని అణిచి పెట్టాడు. అది జెఎసి నేతలకు నచ్చలేదు. జెఎసి అన్నా, దాని అధినేత కోదండరాం అన్నా తాను చేసిన మట్టిబొమ్మలని, తాను ఆడించినట్లు మాత్రమే ఆడుతాయని ఆశించాడు కెసిఆర్. కానీ కోదండరాం ఆయన్ను ధిక్కరించి, ఉద్యమాన్ని నేర్పుగా తన చేతులలోకి తీసుకొన్నాడు. ఏ రోజుకైనా కెసిఆర్ రంగంలోకి దిగితే కోదండరాం వెనుక వరసకు వెళ్లిపోతాడు. కానీ అహం అడ్డు వస్తున్నది. తనతో ప్రమేయం లేకుండా తలపెట్టిన సెప్టెంబర్ 30తేది కవాతును నిర్వీర్యం చేయాలని కెసిఆర్ ప్రయత్నించాడు. అందుకోసం ఢిల్లీలో అందరి కాళ్లూ పట్టుకొన్నాడు. అవసరమైతే తన టిఆర్ఎస్ పార్టీని పూర్తిగా కాంగ్రెస్‌లో విలీనం చేస్తానని కూడా వాగ్దానం చేశాడు. అయినాసరే అధిష్టానం మనసు కరగలేదు. అదొక బండరాయి అని ఆలస్యంగా అర్థమైంది కెసిఆర్‌కి. ఇప్పుడాయనే స్వయంగా సెప్టెంబర్ 30 కవాతులో పాల్గొనక తప్పడం లేదు.

జెఎసి నిర్వాహకుడు కోదండరాం కెసిఆర్‌ను మాత్రమే కాదు, మొత్తం రాష్ట్రాన్నే ఇరకాటంలో పెట్టే నేర్పుతో ఈ కవాతుకు రూపకల్పన చేశాడు. 29తేది హైదరాబాద్‌లో వినాయక నిమజ్జనం జరగబోతున్నది. రెండు మూడు లక్షల మందికి పైగా జనం పాల్గొనే భారీ మత పరమైన కార్యక్రమం అది. దానికి ఏ మాత్రం అవరోధం కల్పించినా హైదరాబాదు మంటలలో మాడి మసై పోతుంది. తెలంగాణ వాదులు ఈ వినాయక నిమజ్జనం భక్తులతో కలిసిపోయి, ట్యాంక్ బండ్ ప్రాంతానికి చేరుకొంటున్నారని తెలిసినా పోలీసు చేయగల్గింది ఏదీ లేదు. వారిని అడ్డగించే అవకాశం లేదు. రాత్రికి అక్కడకు చేరుకొన్న వారు, తెల్లవారే వరకు అక్కడే వుండిపోతే, కవాతు విజయవంతమైనట్లే లెక్క. వేల సంఖ్యలో ఒక చోట గుమికూడిన జనాన్ని అదుపు చేయడం ఏ చైనాలోనో తప్ప మరెక్కడా వీలు కాదు. 1తేది నుంచి హైదరాబాదులో జీవ వైవిధ్య సదస్సు జరగబోతున్నది. 193 దేశాల నుంచి ప్రతినిధులు వస్తున్నారు. అంత ప్రతిష్టాకరమైన సదస్సు జరిగే సమయంలో హైదరాబాదు నగరం తెలంగాణ ఉద్యమకారుల ముట్టడిలో చిక్కుకపోతే దేశం పరువే పోతుంది. తెలంగాణ అంశానికి అంతర్జాతీయ ప్రాధాన్యత లభిస్తుంది. విదేశాల నుంచి వస్తున్న పత్రికా విలేకరులు సదస్సును వదలిపెట్టి, ఈ ముట్టడి మీదకు తమ కెమెరాలు తిప్పుతారు. ఆ సంకట పరిస్థితి తప్పించుకోవాలంటే కవాతును వాయిదా వేయించడం ఒక్కటే పరిష్కారం.

కొరవ 14వ పేజీలో

# ఆదాల కళాపీఠం అద్భుత నృత్యోత్సవం!

నెల్లూరులో ఒక అరుదైన అద్భుతమైన నృత్యోత్సవం నిర్వహిస్తున్నాడు సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి. ఒక పక్క వ్యాపారం, మరొకప్రక్క రాజకీయంతో క్షణం తీరికలేకుండా గడిపే ఆదాల ప్రభాకర్‌రెడ్డిలో తెలియని కళా తృష్ణ దాగి వుందని గత ఏడాది బయటపడింది. రాష్ట్ర స్థాయిలో కూచిపూడి నృత్య పోటీలు నిర్వహించి, మంజుభార్గవి వంటి సుప్రసిద్ధ కళాకారిణితో నాట్య ప్రదర్శన ఇప్పించి, నెల్లూరీయుల కళా దాహం తీర్చాడు. దాన్ని గమనించిన మాజీ డిజిపి సి.ఆంజనేయరెడ్డి గారు, ఇదొక నిరంతర స్రవంతి వలె కొనసాగాలనే ఆకాంక్షతో, ప్రభాకర్‌రెడ్డిని ఒప్పించి, ఆదాల కళాపీఠం అనే శాశ్వత ట్రస్ట్ ఏర్పాటు చేయించాడు. సాధారణ నృత్య పోటీల కార్యక్రమంగా కాకుండా, ప్రసిద్ధ కళాకారులతో ప్రదర్శనలుగా రూపకల్పన చేశాడు. రేపు 28 నుంచి 30 తేది వరకు దర్గామిట్టలోని కస్తూరిబా కళాక్షేత్రంలో అత్యంత ఘనంగా నిర్వహించబోతున్నారు నృత్యోత్సవాన్ని.

28తేది తొలిరోజు, నటరాజ రామకృష్ణ శిష్యుడు కళాకృష్ణ ప్రదర్శన వుంటుంది. అభినవ సత్యభామగా ప్రఖ్యాతి చెందిన కళాకృష్ణ, ఆంధ్ర నాట్యంలో ప్రావీణ్యుడు. పురాణ కాలం నుంచి గురు శిష్య పరంపరగా నడుస్తూ వుండిన దేవాలయ నృత్యాలకు ప్రాణ ప్రతిష్ట చేసినవాడాయన. ఆయన ప్రదర్శించే నవజనార్దన పారిజాతం అనే నృత్య కావ్యం కన్నుల విందు చేస్తుందని ప్రతీతి.

రెండవ రోజు, 29తేది సాయంత్రం ప్రఖ్యాత కూచిపూడి నృత్య కళాకారిణి దీపికా రెడ్డి ప్రదర్శన వుంటుంది. సమకాలీన కూచిపూడి నృత్య ప్రపంచంలో దీపికారెడ్డికి ప్రత్యేక స్థానం వుంది. వెంపటి చినసత్యం వద్ద శిక్షణ పొందిన కళాకారిణి ఆమె. జపాన్ ప్రభుత్వం ఆమెకు తమ దేశపు గౌరవ పౌర

కొరవ 14వ పేజీలో

# తుగ్లక్ ప్రభుత్వం

స్వాతంత్ర్యానికి పూర్వం, కొన్ని వేల సంవత్సరాల పాటు రాజులకు, ప్రభుత్వాలకు ఏకైక ఆదాయ వనరు భూమి శిస్తు మాత్రమే. రైతుల నుంచి సాగు భూముల రకాన్ని బట్టి ఎకరాకు ఇంత అని పన్ను వసూలు చేసి, ప్రభుత్వాలను నడిపేవారు. మొగల్ పాలనలో రాజ్యంలోని భూమి మొత్తం చక్రవర్తుల స్వంతం. సాగు చేసేవారు కౌలు దారులు మాత్రమే. వారు పండించే పంటలోనూ 20శాతం చక్రవర్తికి పన్నుగా చెల్లించాలి. మహమ్మద్ బిన్ తుగ్లక్ వంటి చక్రవర్తులు భూమి శిస్తు వసూలు పేరిట రైతులకు ప్రత్యక్ష నరకం చూపించారు. బ్రిటీష్ దొరలు రాజ్యాన్ని హస్తగతం చేసుకొన్న తర్వాత కొంతకాలం ఇదే పద్ధతి కొనసాగింది. కానీ గవర్నర్ జనరల్ థామస్ మన్రో భూసంస్కరణలు చేపట్టి, రైత్వారీ పద్ధతి ప్రవేశ పెట్టాడు. శిస్తు చెల్లించడానికి ముందుకు వచ్చే ఔత్సాహిక రైతులకు భూమిని కేటాయించి, వారికి యాజమాన్య హక్కు కల్పించాడు. శిస్తు వసూలుకు గ్రామాధికారులను నియమించాడు. దీనితో దేశమంతా భూమి నిర్వహణలో క్రమబద్ధత ఏర్పడింది. సర్వేలు జరిగాయి. గ్రామాలలో రైతులకు ఆత్మగౌరవం ఏర్పడింది. ఆ దినాలలో అదొక విప్లవాత్మక సంస్కరణ.

భూమి శిస్తు ద్వారా వచ్చే రాబడిలో కొంత భాగాన్ని చెరువులు, కాలువల త్రవ్వకం వంటి సాగు వసతుల కల్పనకు వాడాలని కూడా శాసనం చేశారు. అయితే ఈ శాసనం సక్రమంగా అమలయ్యేది కాదు. శిస్తు వసూలు కోసం రైతులను తీవ్రంగా వేధించేవారు. కరవు, తుఫాన్ల వంటి విపత్తులు వచ్చి, పంట నాశనమైనా శిస్తు మాత్రం కట్టమని వేధించే వారు. జమీందారీ పాలనలో వుండే గ్రామాలలో ఈ హింస మరింత అధికంగా వుండేది. శిస్తు కట్టలేదని రైతుల ఇళ్ల లోని సామాను జప్తు చేసే వారు. పాడి పశువులను ఎత్తుకెళ్లేవారు. భూమిని స్వాధీనం చేసుకొనేవారు. సాగు అవసరాలను మాత్రం పట్టించుకొనేవారు కాదు. వరదలకు చెరువులకు గండ్లు పడినా పూడ్చే వారు కాదు. దానితో సాగు దుర్లభమయ్యేది. ఆ చిత్రహింస భరించలేక రైతులు ఆత్మహత్యలకు పాల్పడేవారు. ప్రభుత్వ నిర్వహణకు కావలసిన ప్రతి పైసా రైతు నుంచే దండుతున్నా రైతుల సంక్షేమం మాత్రం పట్టించుకొనేవారు కాదు. అవొక చీకటి రోజులు. ఎన్టీరామారావు అధికారంలోకి వచ్చిన తర్వాత కొన్ని వేల సంవత్సరాలుగా కొనసాగిన ఈ భూమి శిస్తు వసూళ్లను రద్దు చేశాడు.

ఇప్పటి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం మరొకసారి ఆనాటి తుగ్లక్ పాలనను తలపింప చేస్తున్నది. రాష్ట్రంలో ఇప్పుడు వ్యవసాయం అత్యంత దుర్భర పరిస్థితులలో వుంది. ఎటుచూసినా కరవు మబ్బులు క్రమ్ముకొంటున్నాయి. కృష్ణా నది ఎండిపోవడంతో అటు రాయలసీమ, ఇటు కోస్తా జిల్లాలలో పంటసాగు అనుమానంగా మారింది. బావుల క్రింద సాగు చేసే వారికి కరెంట్ కోత చుక్కలు చూపిస్తున్నది. మరొకప్రక్క విత్తనాలు దొరకడం లేదు. ఎరువులకు కృత్రిమ కొరత వుంది. కేంద్ర ప్రభుత్వం యూరియా ధరను భరించ రాని దశకు తీసుక వెళ్లింది. గిట్టుబాటు ధరలు లేవు. పండించిన పంటను కొనేవాడు లేడు. రైతు జీవితాన్ని నాశనం చేయడానికి అటు ప్రకృతి, ఇటు ప్రభుత్వం ఏ మార్గాన్నీ వదలడం లేదు. ఇంతటి దారుణమైన పరిస్థితులలో విద్యుత్ చార్జీలను పెంచడమే కాక బొగ్గు, గ్యాస్ ధరలు పెరగడం వల్ల విద్యుత్ ఉత్పత్తికి అయిన అదనపు ఖర్చు పేరిట 8వేల 283 కోట్ల రూపాయలు విద్యుత్ వినియోగదారుల నుంచి వసూలు చేయడానికి అనుమతించాడు ముఖ్యమంత్రి. వినియోగదారుల మీద దీనివల్ల పడే భారం అంతా ఇంతా కాదు. వినియోగదారులలో రైతాంగం కూడా కలిసే వుంటుంది. మరొకప్రక్క ఉచిత విద్యుత్ మీద కూడా కొన్ని రకాల సర్ చార్జీలు విధించడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

ప్రభుత్వానికి ఎన్నో రూపాలలో పన్నుల రాబడి వుంది. కేంద్ర పన్నులలో వాటా వుంది. అమ్మకం పన్ను, మద్యం వ్యాపారాలు రెండింటి ద్వారానే దాదాపు 50వేల కోట్ల రూపాయల రాబడి వస్తున్నది. అందువల్లనే బడ్జెట్ పరిమాణం లక్ష కోట్లు దాటింది. ఆ సొమ్ములో సక్రమంగా జరిగే ఖర్చు పాతిక వంతు కూడా లేదన్నది వాస్తవం. అవినీతికి, అసమర్థతకు హారతి కర్పూరమై పోతున్నది ప్రభుత్వ ఖజానా. దాన్ని సరిదిద్దుకోవాల్సిందిపోయి, తుగ్లక్ జుట్టు పన్ను విధించినట్లు ఇంధన ధరల పెరుగుదల పేరిట విద్యుత్ సర్‌చార్జీలు విధించడం దారుణమైన విషయం. కిరణ్‌కుమార్‌రెడ్డి ఈ పిచ్చి పనులు మానుకోవాలి. లేకుంటే చరిత్రలో తుగ్లక్‌కు పట్టిన గతే ఆయనకూ పడుతుంది.

జమీన్‌రైతు

## జనవాణి

### పోలీసు వ్యవస్థను సంస్కరించాలి!

పోలీసులు పడే బాధలు ఉన్నతాధికారుల దృష్టికి తీసుక వెళ్లడానికి పోలీసు కుటుంబాలు రోడ్డెక్కితే, వారి సమస్యలు అర్థం చేసుకోకపోగా అణచివేయడానికి ప్రయత్నించారు. ఈ మధ్య ఒక ఎస్పీ అవినీతిని బయటపెడితే ఎస్పీపై సస్పెన్షన్ వేటు పడింది. చేసే అవినీతి నిశ్శబ్దంగా చేసుకోవాలని పత్రికలకు, మీడియాకు ఎక్కకూడదని పోలీసు పెద్దలు చెబుతుంటే అవినీతి ఏ స్థాయిలో వుందనేది అర్థం చేసుకోవచ్చు. ఇటువంటి సంఘటనలను పౌర సమాజం ఖండించకపోతే బ్రిటీషు వాళ్లకు భయపడినట్లుగా పోలీసులకు భయపడాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. తీరికలేని పని వేళలు, సమ్మె చేసే హక్కు లేకపోవడం, సరైన సదుపాయాలు లేకనే పోలీసు వ్యవస్థలో తప్పులు జరుగుతున్నాయి. ప్రజాస్వామ్యం నిలబడాలంటే వీటన్నింటిపై అధ్యయనం జరగాలి.

వి.దేవరాజులు — నెల్లూరు

### ఎలా బతకాలి?

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజలపై వడ్డింపులకు పూనుకొంటున్నాయి. నిన్న కాక మొన్న కరెంటుకు సర్‌చార్జీలు నేడు డీజిల్‌పై లీటరు ఐదు రూపాయలు పెంచారు. దీని వల్ల నిత్యావసర వస్తువుల ధరలన్నీ పెరిగిపోతున్నాయి. అందరికీ నిత్యం అవసరమయ్యే గ్యాసు సిలిండర్ల సబ్సిడీపై కోత. ఈ కోతలు సామాన్యుడు భరించలేకున్నాడు. ప్రజలకు అండగా వుండాల్సిన ప్రభుత్వమే ప్రజల నెత్తిన పెంపుబండలు పెట్టడం బాధాకరం.

బి.శ్రీవాణి — నెల్లూరు

### నదీ జలాల వృథా!

రాష్ట్రంలో గోదావరి అదనపు వరద నీటి ప్రవాహాన్ని వందలు, వేలు క్యూసెక్కులు సముద్రంలో వృథాగా కలిపి వేస్తున్నారు. నది ఎగువ ప్రాంతమైన మహారాష్ట్రలో అతి వృష్టి ముంచెత్తినప్పుడు ఉధృత వరద ప్రవాహాన్ని అదుపు చేసుకొని సాగు, తాగు నీరుకు ఉపయోగించాల్సిన మన రాష్ట్ర ప్రభుత్వం ఈ విషయంలో విఫలం చెందడం బాధాకరం. గోదావరి జలాల సద్వినియోగంలో భాగంగా జల విద్యుత్ కేంద్రాల ఏర్పాటుకు ప్రణాళికలు రూపొందించాలి.

పి.సత్యం — కావలి

### ఇదేం ఆధార్ కార్డు!

ఆధార్ కార్డుల వల్ల అనేక ఉపయోగాలుంటాయని ఊదరగొడుతున్నారు. ఈ కార్డుల డేటా నమోదు, పంపిణీలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అన్ని రాష్ట్రాల కంటే ముందుందని చెబుతున్నారు. ఈ కార్డు కోసం నమోదు చేసిన వివరాలు బాగానే వున్నా కార్డులో పుట్టిన తేదీ కాలమ్ లేదు. చిరునామా రుజువు చేయ

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

5-10-1942
పేజీలు : 8 వెల: అణా

### ఎలక్షన్ హడావిడి

ఎలక్షన్ దినాలు సమీపించే కొద్దీ అభ్యర్థులంతా వసంతాగమనంతో ఫలపుష్ప భరిత శోభిత రమణీయంగా కనపడే వృక్షాల మాదిరి ప్రసన్న భావాలతో దర్శనమిస్తున్నారు. నెల్లూరుకు సామాన్య స్థానాలు నాలుగు డివిజన్‌లకు నాలుగు, హరిజన స్థానమొకటి. మహమ్మదీయ స్థానమొకటి. కుల్లు 6 స్థానాలు.

కాంగ్రేసు పార్టీ, జస్టిసు పార్టీ, పీపుల్సు పార్టీ అనే మూడు పార్టీల అభ్యర్థులు సామాన్య స్థానాలకు పోటీచేస్తారని తోస్తుంది. పీపుల్స్ పార్టీ చైత్రంలో పుట్టి, శ్రావణంలో ఉపాకర్మ జరిగింది కాబట్టి దీని మూతి ముక్కు జూచి ఎవరెవరు వరిస్తారో యింకా ఎస్టిమేటు తయారు కాలేదు.

గూడూరు డివిజన్; ఇది వెంకటగిరి జమీందారుకు పెట్టని కోట. వెంకటగిరి, పోలూరు రెండు డివిజన్‌లు వారి గుప్పెట్లో ఉన్నవి. ఇక గూడూరు, రాపూరు తాలుకాలు ధన వ్యామోహంతో తిరగవా అని జమీందారు పార్టీ వారి గుసగుసలు. జమీందారుతో మోటుకొనే వ్యక్తి ఆ డివిజన్‌లో లేకపోవడం వల్లనే వారు విజృంభిస్తున్నారు.

పెల్లేటి వెంకట సుబ్బారెడ్డి గారు కాంగ్రేసు కాగితం మీద చేవ్రాలుబెట్టి నిలబడితే ఢణుతె గుర్తుంది. గూడూరు తాలుకాలో గూడూరుకు తూర్పు పెల్లేటి వీర్రాఘవరెడ్డి, దువ్వూరు నారాయణరెడ్డి గారలు ఏకమైనారంటే రాజాసాహెబు పీకెలు పారవు. వీర్రాఘవరెడ్డి గారా వెంకట సుబ్బారెడ్డి గారికి ఆత్మీయులు; నారాయణరెడ్డి గారా బావమరుదులు. ఇక కలవకపోవడమనేది మృగ్యం.

– సంజయుడు

## 50 ఏళ్ల క్రితం ఈవారం

28-9-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### చిత్తూరు అపశకునం

“చిత్తూరు ఎన్నికకు ముందు వెంకటేశ్వరుని సన్నిధికి పోయి, ఎప్పటివలె పది రూపాయల కాగితాన్ని హుండీలో వేయబోగా అది నీటిలో పడిపోయింది. అప్పుడే అనుకున్నాను. చిత్తూరు ఎన్నికలో పెట్టే ధనమంతా గంగపాలని.

కాంగ్రెస్ అభ్యర్థిని విరమింపజేయాలనే సంకల్పం గూడా గలిగింది. కానీ అప్పటికే నామినేషన్ గూడా వేయబడినందున అది సాధ్యంగాలేదు”. తిరుపతిలోని రుయా హాస్పిటల్ ప్రారంభోత్సవ సభలో ముఖ్యమంత్రి సంజీవరెడ్డి ఉపన్యాస భాగం.

### వృద్ధాప్య భృతి పొందిన మొదటి స్త్రీ!

వృద్ధాప్య భృతి పథకం క్రింద కనిగిరి తాలుకా, తాలకొండపాడు వాస్తవ్యురాలు దారా కొండమ్మకు జీవితాంతం వరకు నెలకు రూ.15లు పెన్షన్ ఇచ్చుటకు ప్రభుత్వం నిర్ణయించింది. ప్రభుత్వం వృద్ధులకు పెన్షన్ యిచ్చుటకు నిర్ణయించిన తర్వాత నెల్లూరు జిల్లాలో దీనిని పొందుతున్న ప్రప్రథమ వ్యక్తి ఈ కొండమ్మ.

ఈ విధంగానే ఈ భృతికి అర్హులైన వారు వందలు, వేలు ఉంటారు. వారికి యిది పొందే మార్గం తెలియక ప్రభుత్వం కల్పించిన ఈ సౌకర్యాన్ని పొందలేక పోతున్నారు. పల్లెలలోని విద్యావంతులు అనాథలైన వృద్ధులకు ఈ పెన్షన్ మంజూరు చేయించే కృషికి పూనుకొంటే అంతకంటే ఉత్తమమైన సంఘసేవ ఉండదు. సంఘ సేవా సంఘాల పెత్తనానికి పోటీలు పడేవారు ఇలాంటి సేవా రంగాలను గమనించవలెను.

# నెల్లూరు ముచ్చట్లు

## సాగునీటి సలహా మండలి సమావేశం

సాగునీటి సలహా మండలి(ఐఏబి) సమావేశం అక్టోబర్ 4వ తేది కలక్టరేట్ ప్రాంగణంలోని గోల్డన్‌జూబ్లీ హాల్‌లో ఏర్పాటు చేస్తున్నట్లు జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్ రెడ్డి చెప్పారు. సోమశిల ప్రాజెక్ట్‌లో గతంలో కన్నా నీరు తక్కువగా నిల్వ ఉన్న దృష్ట్యా ఈ యేడాది రెండో పంట విషయమై అప్పుడే ఎటువంటి నిర్ణయం తీసుకోవడం లేదని స్పష్టం చేశారు.

## పెరిగిన ఆటో ఛార్జీలు

డీజిల్ రేటు పెరిగిందంటూ నెల్లూరులో షేర్ ఆటో ఛార్జీలు మళ్లీ పెంచారు. గతంలో ఎనిమిది రూపాయలున్న ఈ ఛార్జిని పది రూపాయలు చేశారు. రెండేళ్ల క్రితం నగరంలో షేర్ ఆటో ఛార్జి ఐదు రూపాయలుగా ఉండేది. పెట్రోల్, డీజిల్ ధరలు తరచూ పెరుగుతున్న నేపథ్యంలో పది రూపాయలయ్యింది. చిన్నా చితకా ఉద్యోగాలు చేసుకొనే వారు నగరంలోని వివిధ ప్రాంతాల నుంచి రానుపోను నెలకు 600 రూపాయలు ఛార్జీలకే వెచ్చించవలసిన గడ్డు రోజులొచ్చాయి.

## రికార్డు డ్యాన్సర్లపై పోలీసు లాఠీ!

పొట్టకూటి కోసం గుంటూరు, గోదావరి జిల్లాల నుంచి వచ్చిన రికార్డు డ్యాన్సర్లపై నెల్లూరు పోలీసులు తమ ప్రతాపం చూపారు. 47 మంది డ్యాన్సర్లను డ్యాన్స్‌లు చేయకముందే అరెస్ట్‌చేసి మండల మేజిస్ట్రేటు అయిన నెల్లూరు ఎమ్మార్వో భక్తవత్సలరెడ్డి ముందు హాజరు పర్చారు. డ్యాన్సర్లు వినాయకచవితి ఉత్సవాల్లో సాంస్కృతిక ప్రదర్శనలివ్వను నెల్లూరుకు వచ్చారు. వీరు అశ్లీల నృత్యాలు చేస్తారని ముందుగానే ఊహించి పోలీసులు అరెస్ట్ చేశారు. సినిమాల్లో, క్లబ్బుల్లో, పబ్బుల్లో కన్నా అసహ్యమైన డ్యాన్స్‌ను రికార్డు డ్యాన్సర్లు వేస్తారా? కానీ పెద్దవాళ్ల వ్యవహారాల జోలికి పోలీసులు వెళ్లరు. సామాన్యులపైనే తమ ప్రతాపం చూపిస్తారు. అరెస్ట్ తర్వాత పాపం బెయిల్ ఇచ్చే వాళ్లులేక ఆ చిన్న డ్యాన్సర్లు అల్లాడిపోయారు. నెల్లూరులో కళాసంస్థల నిర్వాహకులెవరూ వీరిని పరామర్శించకపోవడం, వీరి గూర్చి పోలీసులను ప్రశ్నించకపోవడం విమర్శకు తావిచ్చింది.

## 40 డిగ్రీలకు చేరిన ఎండ!

సెప్టెంబర్ మొదటి వారం నుంచి మళ్లీ ఎండాకాలం వచ్చినట్లు నెల్లూరులో ఎండలు అదరగొడుతున్నాయి. గడచిన వారంలో 37 సెంట్రీగ్రేడు డిగ్రీల నుంచి ఎండ పెరుగుతూ 23వ తేదీకి 40 డిగ్రీలకు చేరుకొంది. పెరిగిన ఉష్ణతాపం, విద్యుత్ కోతలకు జనం సగం బిక్కచచ్చిపోతున్నారు. వాతావరణంలో మార్పులకు విరుగుడు గూర్చి ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. జనానికి దేవుడు తప్ప మరో దిక్కులేదు.

## నెల్లూరులో హైకోర్టు జడ్జి

హైకోర్టు న్యాయమూర్తి, నెల్లూరు జిల్లా ఫోర్ట్‌పోలియా జడ్జి గుర్రం వెంకట సీతాపతిని 21వ తేది నెల్లూరు బార్ అసోసియేషన్ ఘనంగా సన్మానించింది. తాను నెల్లూరులోనే పుట్టానని, తన తండ్రి గుర్రం సుబ్రహ్మణ్యం వద్ద న్యాయవాదిగా ప్రాక్టీస్‌చేశానని జడ్జి పాత జ్ఞాపకాలను గుర్తుకు తెచ్చుకొన్నారు. ఈ సన్మాన కార్యక్రమంలో జిల్లా జడ్జి ఎల్.శ్రీరామమూర్తి, బార్ అసోసియేషన్ కార్యదర్శి ఇ.వి.రామిరెడ్డి, పెద్ద సంఖ్యలో న్యాయవాదులు పాల్గొన్నారు.

## నిమజ్జనానికి లంచమివ్వాలా?

పోలీసులు లంచం పుచ్చుకోను దేవుడు, దెయ్యమనే భక్తి భయం కూడా చూపెట్లు లేరు. వినాయక చవితి సందర్భంగా నగరంలో వందల సంఖ్యలో ప్రతిష్ఠించిన విగ్రహాల నిమజ్జనానికి పెన్నానదితోపాటు నగరానికి కూతవేటు దూరంలోని బురాన్‌పూర్ చెరువును ఎంచుకొన్నారు. బురాన్‌పూర్ చెరువు దగ్గరకు వెళ్లిన వినాయకుల వివరాలను డ్యూటీలో ఉండే కానిస్టేబుళ్లు వ్రాసుకొని నిమజ్జనానికి మామూళ్లు ఇవ్వమనడంతో విస్తుపోవడం గణేష్ ఉత్సవాల కమిటీ నిర్వాహకుల వంతయ్యింది. నిమజ్జన స్థలాల్లో విద్యుత్ సౌకర్యం వంటి చిన్న ఏర్పాటు కూడా ప్రభుత్వ పక్షంగా చేయలేకపోయారు.

## లక్షలు పలికిన వినాయక లడ్డు!

వినాయకచవితి సందర్భంగా నగరంలోని పలు కూడళ్లలో ఏర్పాటుచేసిన వినాయక విగ్రహాల చేతిలో పెట్టిన లడ్డూకు ఎక్కడలేని డిమాండ్ వచ్చింది. నెల్లూరు అయ్యప్పగుడి సెంటర్, చంద్రమౌళినగర్ కూడళ్లలో పెట్టిన వినాయక మండపాల్లోని ఈ లడ్డూలకు పాట పెట్టగా, రెండు లక్షలు, లక్షా ఐదువేల రూపాయలకు శక్తి ట్రాన్స్‌పోర్ట్ అధినేత రామారావు, వందన గ్రాండ్ హోటల్ అధినేత కొమ్మి రాజేష్‌నాయుడు స్వంతం చేసుకొన్నారు. శబరి శ్రీరామక్షేత్రం వద్ద ఏర్పాటుచేసిన వినాయక మండపంలోని విఘ్నేశ్వరుని చేతిలోని లడ్డూ 81వేల రూపాయలకు అమ్ముడయ్యింది. జిల్లాలో పలు చోట్ల ఈ లడ్డూల వేలంపాటలు జరిగాయి.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Online‌లో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190



గూడూరు ప్రజల మంచినీటి అవసరాలను తీర్చను స్వంత నిధులతో సిద్ధం చేసిన వాటర్ ట్యాంక్‌ను ప్రారంభిస్తున్న వైకాపానేత బత్తిన విజయకుమార్. ప్రక్కన పేర్నాటి శ్యాంప్రసాద్‌రెడ్డి.

## 3, 4 తేదీల్లో పోలేరమ్మ జాతర

వెంకటగిరి పోలేరమ్మ జాతర అక్టోబర్ 3, 4 తేదీల్లో జరుగనుంది. జాతర నిర్వహణ కమిటీ అధ్యక్షునిగా పి.ప్రసాద్ రెడ్డి, సభ్యులుగా ఎన్.కృష్ణయ్య, చింతపట్ల మురళీకృష్ణ, ఎం.మునీంద్రనాయుడు, జానకిరామయ్య, వెంకటరత్నమ్మ, సుభాషిణిలను దేవాదాయ శాఖ నియమించింది. వీరి పదవీకాలం అక్టోబర్ 10వ తేది వరకు కావడం విశేషం.

## రత్నం సంస్కృతి విజయవంతం!

డాక్టర్ కిషోర్స్ రత్నం జెన్‌నెక్ట్స్ స్కూల్ నెల్లూరు, కావలి, తిరుపతి విద్యార్థులతో 22వ తేది అనిల్ గార్డెన్స్‌లో 'రత్నం సంస్కృతి 2012' పేరిట శాస్త్రీయ నృత్య కార్యక్రమం నిర్వహించారు. పది గంటలపాటు నిర్విరామంగా జరిగిన ఈ కార్యక్రమంలో 80 మంది విద్యార్థినీ విద్యార్థులు నృత్యార్చన చేశారు. రాష్ట్రంలో ఇటువంటి కార్యక్రమం ఇదే మొదటిదని రత్నం జెన్‌నెక్ట్స్ స్కూల్ డైరక్టర్ డాక్టర్ కృష్ణకిషోర్ చెప్పారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథులుగా డిఇఓ మువ్వా రామలింగం, రత్నం విద్యాసంస్థల అధినేత కె.వి.రత్నం విచ్చేసి నృత్యార్చన చేసిన పిల్లలకు బహుమతులు పంచారు. ఈ కార్యక్రమంలో విద్యాసంస్థల జనరల్ మేనేజర్ రామ్మూర్తినాయుడు, హెడ్ ప్రిన్సిపాల్ మైఖేల్ సుకుమార్, సీనియర్ మేనేజర్ రాజేష్, ప్రిన్సిపాల్స్, అధ్యాపక బృందం, విద్యార్థినీ విద్యార్థుల తల్లితండ్రులు పాల్గొన్నారు.

## ఆహార అలవాట్లతో గుండె జబ్బులు దూరం

చక్కని ఆహార అలవాట్లు, క్రమం తప్పకుండా వ్యాయామం, మద్యం, పొగత్రాగడం వంటి అలవాట్లకు దూరంగా ఉంటే గుండెజబ్బులు రావని ప్రముఖ గుండె డాక్టర్ డాక్టర్ సి.ఎస్.శ్రీనివాసరాజు చెప్పారు. నెల్లూరు రోటరీ క్లబ్ వరల్డ్ హార్ట్ డేను పురస్కరించుకొని 23వ తేది రోటరీ ఆడిటోరియంలో గుండె జబ్బుల అవగాహన – నివారణ సదస్సు నిర్వహించింది. డాక్టర్ యానిమేషన్ పవర్ పాయింట్ ద్వారా గుండె పనితీరు రక్తం సరఫరా, గుండె కవాటాలు మూసుకోవడం వంటివి విశదీకరించారు. ఈ కార్యక్రమంలో రోటరీ క్లబ్ అధ్యక్ష, కార్యదర్శులు కె.మధుసూధనరావు, కెవి సుబ్రహ్మణ్యం, రోటరీ ఇంటర్నేషనల్ కార్యదర్శి రాఘవేంద్ర షెట్టి తదితరులు పాల్గొన్నారు.

కొరవ 14వ పేజీలో

# నన్ను తిడతారా... అయితే పడగొడతా!

## • నెల్లూరు క్లబ్ నూతన భవనం కూలిన విధం బెట్టిదనిన...



నెల్లూరు క్లబ్‌లో నూతనంగా నిర్మించిన భవనాన్ని ధ్వంసం చేస్తున్న దృశ్యం.

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి అధికార దాష్టీకానికి నగరంలోని మరో ఎత్తైన కట్టడం కుప్పకూలింది. నగరంలోని పలువురు పెద్ద మనుషులు సభ్యులుగా ఉన్న సంస్థలో ఈ కట్టడం నిర్మాణానికి లక్షలాది రూపాయలు విరాళంగా యిచ్చిన వారంతా ఎమ్మెల్యే వెర్రిచేష్టలకు లోలోన కుమిలి పోవడమే కానీ బహిరంగంగా ఎదురు నిలబడి ఉంటే పరిస్థితి మరో రకంగా ఉండేది. బారాషహీద్ దర్గాకు ఎదురుగా ఉన్న నెల్లూరు క్లబ్‌లో నాలుగేళ్లుగా క్లబ్ విస్తరణ పనులు జరుగుతున్నాయి. మరో రెండు మూడు నెలల్లో ఐదంతస్తుల ఈ భవన నిర్మాణం పూర్తికానుంది. ఈ క్లబ్‌లో సభ్యులైన కొంత మంది మద్యం మత్తులో రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి నగరంలో చేస్తున్న తిక్కచేష్టల గూర్చి మాట్లాడుకొన్నారట. ఈ విషయం ఎవరో వివేకానందరెడ్డికి ఉప్పందించారట. ఇంకేముంది తన చేతిలో కార్పొరేషన్ అక్రమ యమపాశవు ఉచ్చును క్లబ్ పైకి వదిలారాయన. 20, 21 తేదీల్లో ఆధునిక విధ్వంసక పరికరాలతో 150 మంది మునిసిపల్ సిబ్బంది క్లబ్ నూతన భవన నిర్మాణంలో కుంటి సాకులను చూపుతూ కూలగొట్టి పోయారు. అప్పటికే ఈ క్లబ్ అధ్యక్షుడు వివేకానందరెడ్డి ఆగ్రహజ్వాల నుంచి నూతన కట్టడాన్ని కాపాడను తాను కూడా 'రెడ్డి'నన్న విషయం మరచి కాళ్లావేళ్లాపడి బతిమాలినా ప్రయోజనం లేకుండా పోయింది. నగరంలో లెక్కలేనన్ని అక్రమ కట్టడాలున్నా కనీసం కన్నెత్తి కూడా చూడని కార్పొరేషన్‌లోని వివేక వందిమాగధ అధికార బృందం పైసాపైసా కూడబెట్టి కట్టిన నెల్లూరు క్లబ్ భవనాన్ని కూలగొట్టడం చర్చనీయాంశమయ్యింది. అధికారంలో ఉన్న అజాగళ స్థనాన్ని అధికార యంత్రాంగాన్ని మరీ ఇంతగా గ్రోవాలా?

# గుండెవ్యాధిగ్రస్తుల కోసం నారాయణలో ఆధునిక పరికరం!

గుండె వ్యాధితో బాధపడుతున్న వారికి వైద్యం చేయడానికి అరుదైన పరికరం తమ ఆసుపత్రిలో అందుబాటులోనికి వస్తుందని నారాయణ హాస్పిటల్ డైరెక్టర్ డాక్టర్ సుబ్రహ్మణ్యం చెప్పారు. చింతారెడ్డిపాళెంలోని నారాయణ జనరల్ హాస్పిటల్‌లో విలేకరులతో మాట్లాడారు. అమెరికాలోని టెక్సాస్ యూనివర్శిటీకి చెందిన పరిశోధన డాక్టర్లకు, నారాయణ మెడికల్ కళాశాల డాక్టర్లకు మధ్య ఒప్పందంలో భాగంగా నారాయణ హాస్పిటల్ నుంచి ముగ్గురు సభ్యుల బృందం పది రోజుల క్రితం టెక్సాస్‌కు వెళ్లివచ్చినట్లు చెప్పారు. గుండె నొప్పితో బాధపడే వారి కోసం టెక్సాస్ డాక్టర్లు స్వెటర్ లాంటి ఒక పరికరాన్ని తయారు చేస్తున్నారని, దానిని వ్యాధిగ్రస్తుడు ధరిస్తే అతనికి నొప్పి రావడానికి ముందే ఆ పరికరం సమాచారం ఇస్తుందన్నారు. ఈ సమాచారంతో వ్యాధిగ్రస్తుడు ముందస్తుగా ఆసుపత్రిలో చికిత్స చేయించుకొని ఉపశమనం పొందవచ్చన్నారు. మెదడు, గుండెలో రక్తం గడ్డకట్టడంపై కూడా పరిశోధన చేస్తున్నామన్నారు. త్వరలో టెక్సాస్ యూనివర్శిటీ నుంచి ఒక బృందం నారాయణ హాస్పిటల్ పరిశోధనా కేంద్రానికి రానున్నట్లు డాక్టర్ సుబ్రహ్మణ్యం చెప్పారు.

# బాణసంచా తయారీ కేంద్రాల తనిఖీ!

నెల్లూరు నగరంతోపాటు జిల్లాలో పలు ప్రాంతాల్లో ఉన్న బాణసంచా తయారీ కేంద్రాలను పోలీసులు తనిఖీ చేస్తున్నారు. దీపావళి పండుగ దగ్గర పడడంతో బాణసంచా తయారీ కేంద్రాలపై పోలీసులు ప్రత్యేక దృష్టి సారించారు. నెల్లూరు నగరంలోని పెన్నా పొర్లుకట్ట ప్రాంతంలో పలు బాణసంచా తయారీ కేంద్రాలున్నాయి. వివిధ రకాల పేర్లతో ఉన్న ఈ కేంద్రాల్లో గతంలో అగ్నిప్రమాదాలు సంభవించి ప్రాణ నష్టం కూడా జరిగింది. నిబంధనలు పాటించక పోవడం, లైసెన్స్ రెన్యువల్ చేసుకోక పోవడం వంటి కారణాలున్నాయి. ఈ కేంద్రాల్లో నిత్యం తనిఖీలు చేస్తే తప్పకుండా నిర్వాహకులు నిబంధనలు పాటించే అవకాశం ఉంటుంది. అలా కాకుండా ఆరు నెలలకో, సంవత్సరానికో తనిఖీలు చేస్తే ఎటువంటి ఫలితం ఉండబోదన్న విషయాన్ని పోలీసులు గుర్తించాలి. బాణసంచా తయారీ కేంద్రాలకు రెవిన్యూ డివిజన్ అధికారి లైసెన్స్ మంజూరు చేస్తారు. ముందుగా అగ్నిమాపక శాఖ నుంచి సిఫార్సు అందాలి. దీనిని పరిశీలించి లైసెన్స్ ఇస్తారు. ప్రతి సంవత్సరం రెన్యువల్ కోసం కొంత ఫీజు చెల్లించాల్సి ఉంటుంది. అయితే కొందరు లైసెన్స్‌ను రెన్యువల్ చేయించకుండానే బాణసంచా తయారు చేస్తున్నారు.



నెల్లూరు అనిల్ గార్డెన్స్‌లో రత్నం సంస్కృతి 2012 శాస్త్రీయ నృత్య కార్యక్రమాన్ని జ్యోతి వెలిగించి ప్రారంభిస్తున్న డిఇఓ రామలింగం. ప్రక్కన రత్నం జెన్‌నెక్స్ట్ డైరెక్టర్ డాక్టర్ కృష్ణకిషోర్ తదితరులు.

# ఐల్యాండ్‌లతోనే ట్రాఫిక్‌కు ఇబ్బంది!

## తేల్చి చెప్పిన అడ్వయిజరీ కమిటీ!



ఆర్టీసి బస్టాండ్ వద్ద ఏర్పాటుచేసిన ఇందిరమ్మ విగ్రహం.

నెల్లూరు నగరంలో అభివృద్ధి మాట ఎలా ఉన్నా ఐల్యాండ్‌లు మాత్రం సగం రోడ్లను ఆక్రమించుకొని ఉంటున్నాయి. తమ జేబులు నింపుకొనేందుకు, కాంట్రాక్టర్ల పేరుతో బినామీలను ఏర్పాటు చేసుకొని ఒక వైపు రోడ్డు విస్తరణ చేయిస్తూ, మరో వైపు విగ్రహాలు పెట్టి, చుట్టూ ఐల్యాండ్‌లు కట్టి పారేయడంతో రోడ్డు కుంచించుకపోయి వాహనాల రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడుతోంది. ఇటీవల జిల్లా ఎస్పీ రమణకుమార్ నగరంలో ట్రాఫిక్ సమస్యను చక్కదిద్దేందుకు అడ్వయిజరీ కమిటీ వేసి ఆయా ప్రాంతాలను పరిశీలించి తగిన సలహాలు కోరారు. పోలీస్, మునిసిపల్, ఇతర శాఖల అధికారులు ఉన్న ఈ అడ్వయిజరీ కమిటీ నగరంలో ప్రధాన కూడళ్లను, అక్కడి ట్రాఫిక్ ఇబ్బందులను పరిశీలించింది. ఆర్టీసి బస్టాండు, మద్రాస్ బస్టాండ్, గాంధీబొమ్మ, నర్తకి సెంటర్, ఆత్మకూరు బస్టాండు, రామలింగాపురం తదితర కూడళ్లను పరిశీలించిన ఈ కమిటీ అక్కడ ఏర్పాటుచేసిన విగ్రహాలు, నిర్మించిన ఐల్యాండ్‌ల వల్లనే ట్రాఫిక్ సమస్య తలెత్తుతున్నట్లు గుర్తించింది. ముఖ్యంగా ఆర్టీసి బస్టాండ్ వద్ద ఏర్పాటుచేసిన ఇందిరమ్మ విగ్రహం, చుట్టూ కట్టిన ఐల్యాండ్ వలన సగం రోడ్డు కుంచించుకు పోయినట్లు అధికారులు గుర్తించారు. ఈ విగ్రహాన్ని ఏర్పాటు చేసేందుకు, ఐల్యాండ్‌ను కట్టేందుకు ఎక్కడాలేని విధంగా ఆర్టీసి బస్టాండ్‌కు ముందున్న కార్మికుల కార్యాలయాలను తొలగించి ఆర్టీసి ఆవరణలోనికి మార్చడం అప్పట్లో విమర్శల పాలయ్యింది. అలాగే రామలింగాపురం సెంటర్‌లో ఏర్పాటుచేసిన ఆనం వెంకటరెడ్డి విగ్రహం, అక్కడ కట్టిన ఐల్యాండ్ వలన అధిక భాగం రోడ్డు ఆక్రమించుకొన్నట్లు ట్రాఫిక్ అడ్వయిజరీ కమిటీ ఒక నిర్ధారణకు వచ్చింది. వీటిని ఎస్పీ రమణకుమార్ దృష్టికి తీసుకొని పోయింది ఈ కమిటీ. ఈ ఐల్యాండ్‌ల విస్తీర్ణం తగ్గించడం వలన కొంతమేర ప్రయోజనకరంగా ఉంటుందని భావిస్తున్నారు వారు. రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి ఇష్టపడి కట్టించిన ఐల్యాండ్‌లను పగులగొట్టి వాటిని తగ్గించి కట్టే దమ్ము, ధైర్యం అధికారులకు ఉందో లేదో చూడాలి.

# అధిక జీతాల వల్ల ఆర్టీసీకి నష్టాలు!

## సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్ర రాజగోపాల్ ప్రకటన

ఏపిఎస్ ఆర్టీసిలో అధికారులకు కనివినీ ఎరుగని రీతిలో అత్యధికంగా జీతాలు ఇవ్వడం వల్ల సంస్థాపరంగా నష్టాలు వాటిల్లుతున్నాయని సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్ర రాజగోపాల్ విమర్శించారు. ఆర్టీసి నెల్లూరు రీజినల్ కార్యాలయం వద్ద సిఐటియూ అనుబంధ ఎస్‌డబ్ల్యుఎఫ్ నేతలు చేపట్టిన ఆమరణ దీక్షాశిబిరాన్ని సందర్శించి కార్మికులను ఉద్దేశించి రాజగోపాల్ మాట్లాడారు. ఆర్టీసిలో అత్యధిక జీతాలు తీసుకునే అధికార యంత్రాంగం చేసే పని మాత్రం ఏమీలేదన్నారు. ఆర్టీసి కార్మికులు ఎదుర్కొంటున్న అప్పీలు, బదలీలు, లీగల్ కేసుల్ని పరిష్కరించాలని కోరారు. కాంట్రాక్ట్ కార్మికుల రెగ్యులైజేషన్, పెండింగ్ పోస్టుల్లో అన్ సీజన్ పేరుతో తొలగించిన వారికి ఉద్యోగాలివ్వాలన్నారు. డబల్ డ్యూటీ చేసిన వారికి రెట్టింపు వేతనం, క్యాజువల్ ఆఫ్ సదుపాయం కొనసాగించాలన్నారు. అన్ని కేటగిరీల్లో ఖాళీలను భర్తీచేసి, పనిభారం తగ్గించాలన్నారు. మరణించిన, పదవీ విరమణ పొందిన కార్మికుల సెటిల్‌మెంట్లు వెంటనే చేయాలన్నారు. అధికారుల వేధింపులకు స్వస్తి పలకాలని హితవు పలికారు. టిమ్, సింగిల్ క్రూ డ్యూటీలకు బలవంతంగా పంపే విధానానికి స్వస్తి పలకాలన్నారు. ఈ కార్యక్రమంలో మాజీ డిప్యూటీ మేయర్ మాదాల వెంకటేశ్వర్లు, మాజీ కార్పొరేటర్ కత్తి శ్రీనివాసులు కూడా పాల్గొన్నారు.

# పనిచేయని ఆదర్శ రైతులు ఇంటికే...

✦ వ్యవసాయశాఖ జెడి హెచ్చరిక

రైతులకు ఆదర్శంగా వుండని ఆదర్శ రైతులను తొలగిస్తామని వ్యవసాయశాఖ జెడి సుబ్బారావు హెచ్చరించారు. కావలి జవహర్ భారతి కళాశాల సమావేశ మందిరంలో శాస్త్రవేత్తలు, రైతులతో సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ కావలి డివిజన్‌లో 180 మంది ఆదర్శ రైతులు వుండగా వారిలో నలుగురు తప్పుకొన్నారన్నారు. మిగిలిన 176 మందిలో కేవలం 46 మంది మాత్రమే ఈ సమావేశంలో పాల్గొన్నారని చెబుతూ ఈ హాజరును బట్టి ఆదర్శ రైతులు ఎంత నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారో తెలుస్తున్నాదని మండిపడ్డారు. సెప్టెంబర్ 30న వారికి పరీక్షలు నిర్వహిస్తున్నామని హాజరు కాని వారిని తొలగిస్తామని చెప్పారు. బీటి వరి అధికంగా సాగు చేస్తున్నారని, అగ్గి తెగులు ఎక్కువగా సోకే ప్రమాదముందన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని రైతులు దీనికి ప్రత్యామ్నాయంగా నెల్లూరు జిలకర, 1110, సన్నాలను సాగు చేయడం వలన అధిక దిగుబడి సాధించవచ్చన్నారు. ఆదర్శ రైతులు ఆదర్శంగా వుండాలని హితవు పలికారు. ఎరువులు, మందుల వాడకం తదితర అంశాలపై శాస్త్రవేత్త రమేష్ రైతులకు పలు సూచనలు చేశారు.

# ప్రజల్లోనే బీద, రామిరెడ్డి!

## ఇంటింటికి తిరిగి సమస్యలడుగుతున్నారు



ఎన్నికల సమయంలో ప్రజలను కలుసుకొని హామీలు గుప్పించడం సాధారణంగా రాజకీయ నాయకులు చేసే కార్యక్రమం. ఇప్పుడు ఎన్నికలు లేకపోయినా కావలి నియోజకవర్గంలో పోటాపోటీగా తిరుగుతూ ప్రజల సమస్యలు అడిగి తెలుసుకొంటున్నారు స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేత రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి. నియోజకవర్గ పరిధిలో విస్తృతంగా పర్యటిస్తున్న వీరిని చూసి ప్రజలు విస్తుపోతున్నారు. ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు కావలి పట్టణంలో మకాం వేసి అన్ని వార్డులు తిరుగుతూ ప్రజల సమస్యలు తెలుసుకొంటున్నారు. దీని ద్వారా ప్రజలకు దగ్గరయ్యేందుకు, వారితో మమేకమయ్యేందుకు ప్రయత్నిస్తున్నారు. అలాగే వైఎస్ఆర్ పార్టీకి కావలి నియోజకవర్గ ఇన్‌చార్జిగా వున్న రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి కూడా అదే స్థాయిలో పట్టణంలోను, రూరల్ మండలంలోనూ విస్తృతంగా పర్యటిస్తూ ప్రజలను ఏదో ఒక నెపంతో కలుసుకొంటుండడంతో సాధారణ ఎన్నికలకు ఇంకా రెండేళ్ల వ్యవధి వుండగా అప్పుడే ఈ స్థాయిలో పర్యటనలుండడం ఏమిటని ప్రజలు చర్చించుకొంటున్నారు.



# డాక్టర్లు ఆత్మపరిశీలన చేసుకోవాలి!

వైద్య వృత్తికి ఎంతవరకు న్యాయం చేస్తున్నాము, అసలు చేస్తున్నామా లేదా అనే దానిపై వైద్యులు ఆత్మ పరిశీలన చేసుకోవాలని జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి డాక్టర్ మాసిలామణి సూచించారు. ఇటీవల కావలి ప్రభుత్వ వైద్యశాల క్లస్టర్ పరిధిలోని ఆరోగ్య కేంద్రాల వైద్యులు, వైద్య సిబ్బందితో సమీక్ష జరిపారు. వైద్యులపై నమ్మకంతో వివిధ చికిత్సల కోసం వచ్చే రోగులకు సరైన వైద్యం అందించాలన్నారు. విషజ్వరాలు అధికం అవుతున్నందున వైద్య సిబ్బంది ఇంటింటికి వెళ్లి డెంగ్యూ, తదితర వ్యాధి లక్షణాలు వుండే వారిని గుర్తించి స్థానిక ఆస్పత్రులకు తరలించాలన్నారు. అవసరమైతే జిల్లా కేంద్రానికి పంపించి మెరుగైన వైద్యం అందించాలన్నారు. విధి నిర్వహణలో నిర్లక్ష్యం వహిస్తే చర్యలు తప్పవని హెచ్చరించారు. ప్రతి ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో డెలివరీ గదులను శుభ్రంగా వుంచుకోవాలని, ఇన్వర్టర్ సౌకర్యం కలిగి వుండాలని, గర్భిణీలు ప్రసవించే వరకు వారి చేత ఒక్క రూపాయి దేనికి ఖర్చు పెట్టనివ్వరాదని తెలిపారు. ఈ సమావేశంలో క్లస్టర్ వైద్యాధికారి సెలినాకుమారి ఇతర వైద్యులు పాల్గొన్నారు.

## డిఎం అండ్‌హెచ్‌ఓ సూచన

● బ్రాహ్మణక్రాకలో

# ఎడ్లబండ్ల పోటీలు!

## విజేత జడదేవి ఎద్దులు

వినాయక చవితి సందర్భంగా జలదంకి మండలం బ్రాహ్మణక్రాక గ్రామంలో ఎడ్లబండ్ల పోటీలు జరిగాయి. మాజీ సర్పంచ్ మేదరమెట్ల కృష్ణారెడ్డి ఆధ్వర్యంలో జరిగిన ఈ పోటీలలో వివిధ ప్రాంతాల నుంచి 11 జతల ఎడ్లు పాల్గొన్నాయి. ఆద్యంతం ఆసక్తికరంగా సాగిన ఈ ఎడ్లబండ్ల పోటీలలో వరికుంటపాడు మండలం జడదేవి గ్రామానికి చెందిన నాగయ్య ఎద్దులు ప్రథమస్థానం సాధించాయి. అదే గ్రామానికి చెందిన చెంచయ్య ఎద్దులు ద్వితీయ స్థానాన్ని, మర్రిపాడు మండలం రామానాయుడు పల్లెకు చెందిన నాగేశ్వరరావు ఎద్దులు తృతీయ స్థానం సాధించాయి. ప్రథమస్థానం పొందిన వారికి 20వేల రూపాయలు, ద్వితీయస్థానం సాధించిన వారికి 15 వేలు, తృతీయస్థానం సాధించిన వారికి 10వేల రూపాయల నగదు బహుమతిని అందజేశారు నిర్వాహకులు.

# లక్ష ఎకరాలను పేదలకు పంచండి!

## సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్ర సలహా

ఆరో విడత భూపంపిణీలో లక్ష ఎకరాలను పేదలకు పంచాలని సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్ర రాజగోపాల్ డిమాండ్ చేశారు. మర్రిపాడు మండలంలో పర్యటించిన ఆయన అక్కడి ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను తెలుసుకొన్నారు. పేదలకు భూములు పంచడంపై మాట్లాడుతూ గత ఐదు విడతల్లో పంచిన భూముల్లో అధికభాగం సాగు భూములేనన్నారు. ఆరో విడత భూపంపిణీలో జిల్లా యంత్రాంగం కేవలం ఏడు వేల ఎకరాలను పంచి మొక్కుబడిగా కార్యక్రమం నిర్వహించాలని చూస్తున్నారని విమర్శించారు. ఈ ఆలోచనను విరమించుకొని లక్ష ఎకరాలను పంచాలని, అప్పుడే పేదల అవసరాలు తీరుతాయన్నారు. సోమశిల హైలెవల్ కెనాల్‌కు తక్షణం శంకుస్థాపన చేయాలని డిమాండ్ చేశారు. ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి దీనికి 800కోట్లు అవసరం అవుతాయని అంచనా వేశారని తక్షణం ఆ పనులను ప్రారంభించాలన్నారు. మర్రిపాడు మండలంలోని 24 పంచాయితీల్లో గల 54 గ్రామాల్లో ఫ్లోరైడ్ కారణంగా ప్రజలు అనారోగ్యానికి గురౌతున్నా ప్రభుత్వం పట్టించుకోవడం లేదన్నారు. ఆయన వెంట స్థానిక సిపిఎం నేతలు నారాయణస్వామి, రాములు, తిరుపతి, సుబ్బరాయుడు తదితరులు పాల్గొన్నారు.

# తెలుగుపాట భ్రష్టుపడుతున్నది!

● కావలి బామా సభలో సామవేదం ఆవేదన

ఎంతో ఘనకీర్తి గల తెలుగు సినిమా సాహిత్యం నేడు భాషరాని గాయకుల కారణంగా భ్రష్టుపడుతోందని విఖ్యాత సినీగేయ రచయిత, ఆధ్యాత్మిక ఉపన్యాసకుడు సామవేదం షణ్ముఖశర్మ ఆవేదన వ్యక్తం చేశారు. బాలసుబ్రహ్మణ్యం మ్యూజిక్ అండ్ ఆర్ట్స్ అకాడమి(బామా) ఆధ్వర్యంలో కావలి పట్టణంలో ఇటీవల పాడనా తెలుగుపాట పేరుతో జాతీయస్థాయి పోటీలు జరిగాయి. ఈ కార్యక్రమానికి అతిథులుగా సామవేదంతోపాటు ప్రఖ్యాత సంగీత దర్శకులు మాధవపెద్ది సురేష్ హాజరయ్యారు. ఈ సందర్భంగా షణ్ముఖశర్మ మాట్లాడుతూ తెలుగు పాటల ప్రస్థానాన్ని, సినీరచయితల గొప్పదనాన్ని వివరించారు. ఆత్రేయ, ఆరుద్ర, వేటూరి, సిరివెన్నెలలాంటి ఎంతోమంది తెలుగు పాటల స్థాయిని పెంచారన్నారు. నేడు వచ్చే గాయనీ గాయకులకు తెలుగుభాషపై పట్టులేదని, పలువురు పరభాషా గాయకులు ఆంగ్లంలో పాటను వ్రాసుకొని పాడడం వలన పాటలోని భావం దెబ్బతింటున్నదన్నారు. మాధవపెద్ది మాట్లాడుతూ బామా చేస్తున్న కృషిని అభినందించారు. అనంతరం విజేతలకు బహుమతులను అందజేశారు. ఈ కార్యక్రమంలో బామా కార్యదర్శి సుధాకర్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# కోవూరు టిడిపి కమిటీ!

తెలుగుదేశం పార్టీ కోవూరు నియోజకవర్గ కమిటీని ఏర్పాటు చేశారు. ఆ పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఈ కమిటీని ప్రకటించారు. బుచ్చిరెడ్డిపాళెం మండల అధ్యక్షులుగా కావలి వెంకటేశ్వర్లు, ప్రధాన కార్యదర్శిగా కాటంరెడ్డి రాధాకృష్ణారెడ్డి, కోవూరు మండలానికి సంబంధించి అధ్యక్షునిగా ఏలూరు కృష్ణయ్య, ప్రధాన కార్యదర్శిగా గొట్టిగుండాల

## ఎంపిక చేసిన సోమిరెడ్డి!

సతీష్‌కుమార్‌రెడ్డి నియమితులయ్యారు. ఇందుకూరుపేట మండల టిడిపి అధ్యక్షునిగా రావిళ్ల వీరేంద్రకుమార్, ప్రధాన కార్యదర్శిగా సుధాకర్, విడవలూరు మండల అధ్యక్షునిగా బెజవాడ వంశీకృష్ణారెడ్డి, ప్రధాన కార్యదర్శిగా చంద్రశేఖర్, కొడవలూరు మండల అధ్యక్షునిగా కొప్పోలు మహేష్‌బాబు, ప్రధాన కార్యదర్శిగా మడపర్తి రాజగోపాల్‌ను ఎంపిక చేశారు. తెలుగుదేశంపార్టీని బలోపేతం చేసేందుకు కృషి చేస్తామని నూతన బాధ్యతలు చేపట్టిన వీరంతా ప్రకటించారు.



భారత్ బంద్ సందర్భంగా కావలిలో బంద్‌ను పర్యవేక్షిస్తున్న వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకుడు రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి.



నెల్లూరు మునిసిపల్ మాజీ వైస్‌ఛైర్మన్ సయ్యద్ సందాని బాష మెమోరియల్ కప్ క్రికెట్ పోటీల్లో విజేతలకు బహుమతి అందిస్తున్న ఆయన కుమారుడు సయ్యద్ సందాని బిలాల్.

# నెల్లూరు జిలకర మసూరి పండించండి!

**రైతులకు వ్యవసాయశాఖ ఏజెడి సలహా.**

రైతులు రబీ సీజన్‌కు అనుకూలమైన నేలను ఎంపిక చేసుకోవడంతోపాటు ఎరువుల వాడకంలోనూ ప్రత్యేక జాగ్రత్తలు పాటించాలని వ్యవసాయశాఖ సహాయ సంచాలకుడు ప్రసాద్‌రావు సూచించారు. కోవూరు మండల పరిషత్ కార్యాలయంలోని సమావేశ మందిరంలో ఆదర్శ రైతుల అవగాహన సదస్సు సెప్టెంబర్ 19న జరిగింది. ఈ సందర్భంగా ఆదర్శ రైతులను ఉద్దేశించి ఆయన మాట్లాడారు. సాగు చేసే రైతాంగానికి తగిన సూచనలు, జాగ్రత్తలు ఆదర్శ రైతులు ఇవ్వాలన్నారు. ముఖ్యంగా శ్రీవరి సాగును ప్రోత్స హించి, వారు అధిక దిగుబడి సాధించేలా ప్రోత్సహించాల న్నారు. ప్రస్తుతం రైతులు బిపిటి ధరలు అధికంగా వుండ డంతో వాటివైపు మొగ్గు చూపుతున్నారన్నారు. ఆ రకాలకు అగ్గి తెగులు సోకే అవకాశం వుందన్నారు. దీని వలన పంట పూర్తిగా దెబ్బతింటుందన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని రైతులు నెల్లూరు జిలకరను ప్రోత్సహించాలన్నారు. రైతులం దరూ పంటల బీమాను సద్వినియోగం చేసుకోవాలన్నారు. తప్పనిసరిగా ఇందులో నమోదు చేసుకోవాలని, ఏదైనా విపత్తు జరిగి పంటనష్టం ఏర్పడితే ఆ రైతుకు బీమా మొత్తం లభిస్తుం దన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని రైతులందరూ పంటల బీమా చేసేలా ప్రోత్సహించాలని సూచించారు. ఈ కార్యక్ర మంలో సీనియర్ శాస్త్రవేత్త వెంకటేశ్వర్లు, ఏరువాక కోఆర్డినే టర్ పల్లంరాజు, కోవూరు, కొడవలూరు, విడవలూరు, బుచ్చి, సంగం మండలాలకు చెందిన వ్యవసాయాధికారులు శ్రీనివా సులు, నాగేశ్వరరావు, మేరీకమల తదితరులు పాల్గొన్నారు.

# కావలిలో ఉద్రిక్తత!

**దురాక్రమణదారులను తరిమిన బీద**



కావలి సమీపంలోని బుదమగుంట ఇంది రమ్మ కాలనీలో ఆక్రమణదారులు, బోగస్ పట్టాలతో స్వంతం చేసు కొన్న ఇంటి బేస్‌మెంట్‌లు, పిల్ల ర్లను అధికారులు ధ్వంసం చేశారు. స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్ రావు స్వయంగా అక్కడకు చేరు కొని వాటిని తొలగింప చేశారు. బోగస్ వ్యక్తులు, దళారులు ఇక్కడ ఇందిరమ్మ ఇళ్లను కట్టి వున్నారని, అర్హులకు ఇవి దక్కకుండాపోతున్నాయని చెప్పిన ఎమ్మెల్యే ఆ మేరకు అధికారులను వెంటబెట్టుకొని ఆ ఇళ్లను జెసిబిలతో కొట్టించి వేశారు. వైఎస్ఆర్ కాం గ్రెస్ పార్టీ కావలి నియోజకవర్గ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి, కాంగ్రెస్ పార్టీకి చెందిన పలువురు మాజీ కౌన్సిలర్లు అక్కడకు చేరుకొని బీద మస్తాన్‌రావు వ్యవహారంపై మండిపడ్డారు. ఏకపక్షంగా వ్యవహరిస్తున్నారని ఇళ్ల తొలగింపులను అడ్డుకోవడంతో ఆ ప్రాంతంలో ఉద్రిక్తత తలెత్తింది. ప్రతాప్‌కుమార్‌రెడ్డి మాట్లాడుతూ తాను ఆక్రమణలను ప్రోత్సహించడానికి రాలేదని, అయితే ఎమ్మెల్యే తీరు వలన అర్హులైన వారు నష్టపోతున్నా రన్నారు. విచారణ జరపకుండా కట్టడాలను కూల్చివేయడం ఎంతవరకు సమంజసం అని ఆయన ప్రశ్నించారు. దీనిపై ఎమ్మెల్యే మస్తాన్‌రావు మాట్లాడుతూ దళారులు, అన ర్హులు బోగస్ పట్టాలతో ఇళ్లు పొందుతున్నారు. వీటికి చరమగీతం పాడేందుకు, అర్హులకు ఇళ్లు దక్కేందుకే అధికారులతో మాట్లాడి ఆక్రమణలను తొలగిస్తున్నామన్నారు. ఆ స్థలంలో అర్హులైన పేదలకు ఇళ్ల పట్టాలు ఇప్పించడం జరుగుతుందన్నారు. ఈ సందర్భంగా గొడవ పడి, అధికారులను అడ్డుకొని గందరగోళం సృష్టించిన మాజీ కౌన్సిలర్లు పేరం వెంకటే శ్వర్లు, మాల్యాద్రి తదితరులను పోలీసులు అరెస్టు చేసి ఆ తర్వాత విడుదల చేశారు. మొత్తం మీద ఇందిరమ్మ ఇళ్ల ఆక్రమణల తొలగింపు కార్యక్రమం కావలిలో తీవ్ర సంచ లనం సృష్టించింది. విచారణలో ఎన్ని బోగస్ పట్టాలు బయటపడుతాయో, ఎందరి కౌన్సి లర్ల పాత్ర బట్టబయలు అవుతుందోనని తీవ్రమైన చర్చ జరుగుతుంది ప్రజలలో.

# బుచ్చిరోడ్లపై వేకువన జనం

**విద్యుత్‌కోతను నిరసిస్తూ వినూత్న నిరసన**

విద్యుత్ కోతలతో విసిగి వేసారిన ప్రజలు తెల్లవారు జామున రోడ్డుపైకి వచ్చి నిరసనకు దిగడం బుచ్చిలో జరిగింది. వేళాపాళా లేకుండా ఏకబిగిన 19 గంటల పాటు విద్యుత్ కోత విధిస్తుండడంతో విసిగిపోయిన పట్టణ ప్రజలు అధికారుల తీరును నిరసిస్తూ సెప్టెంబర్ 16వ తేదీ వేకువజామున 4 గంటల సమయంలో బాంబేరోడ్డులో బైఠా యించారు. పట్టణ ప్రజలు అధికసంఖ్యలో రోడ్డుపైకి చేరు కోవడంతో కలకలం రేగింది. సాధారణంగా జరిగే ఆందోళన లకు భిన్నంగా వేకువన నిరసనకు దిగడం ప్రజలు ఎంతగా విద్యుత్ కోతలతో అల్లాడిపోతున్నారో తెలియజెప్పింది. ఈ సందర్భంగా స్థానికులు మాట్లాడుతూ విద్యుత్‌శాఖ అధికా రుల తీరుపై విరుచుకపడ్డారు. సుమారు రోజుకు 19 గంటల పాటు విద్యుత్ సరఫరా నిలిపివేయడం వల్ల తీవ్ర ఇబ్బందులు పడుతున్నామని ఆవేదన వ్యక్తం చేశారు. విద్యుత్ కోత వలన మంచినీటి సమస్యతోపాటు కనీస అవసరాలకు ఆటంకం కల్గుతుందన్నారు. ఇలాంటి దారుణమైన కోతలు గతంలో ఏ ప్రభుత్వం విధించలేదన్నారు. పెద్ద సంఖ్యలో రోడ్డుపై బైఠా యించడంతో ట్రాఫిక్‌కు తీవ్ర అంతరాయం ఏర్పడింది. భారీగా వాహనాలు నిలిచిపోవడంతో విద్యుత్‌శాఖ అధికా రులు, పోలీసులు అక్కడకు చేరుకొని ఆందోళన చేస్తున్న వారిని శాంతింప జేయడంతో స్థానికులు ఆందోళనను విర మించారు.

# కావలి ఆర్‌అండ్‌బిలో సర్పరాజాల బస!

కావలి ఆర్‌అండ్‌బి అతిథి గృహాన్ని పాముల బెడద వెన్నాడుతోంది. ఆవరణ అంతా చెట్లు పుట్టలతో నిండివుండడం, పొదలు ఏర్పడి వుండడంతో పాముల సం చారం అధికంగా వుంటోంది. దీంతో ఈ అతిథి గృహానికి వచ్చే అతిథులు భయపడుతున్నారు. ప్రోటోకాల్ పాటించే అధికా రుల సైతం ఇక్కడ బస చేసేందుకు వచ్చే ప్రముఖులకు పాముల సంచారం వలన ఇబ్బందులు ఎదురౌతాయని ఆం దోళన వ్యక్తం చేస్తున్నారు. ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డికి ఇక్కడ నాగుపాము కన్పించిందట. అలాగే అతిథి గృహం వాచ్‌మెన్ కుమార్తె స్రవంతి ఇటీవల పాము కాటుకు గురయ్యింది. గెస్ట్ హౌస్ పరిసరాలను పరిశుభ్రంగా వుంచడం, చెట్లు, పొదలను తొలగించడంలో అధికారులు శ్రద్ధ పెట్టకపోవడంతో పాములు వుండేందుకు వీలుగా మారాయి. దీంతో తరచూ పాములు

**నాగుపామును చూసి దడచుకొన్న ఆర్డీఓ**

తిరుగుతూ గెస్ట్‌హౌస్‌లో దిగే వారిని భయభ్రాంతులకు గురి చేస్తున్నాయి. ఇప్పటికైనా సంబంధిత అధికారులు పిచ్చి మొక్క లను తొలగించి శుభ్రంగా వుంచాలని స్థానికులు కోరుకొం టున్నారు.

# రేషన్ బియ్యం పట్టివేత

**పోలీసులకు ప్రోత్సాహకాలిచ్చిన ఎమ్మెల్యే**

అక్రమంగా తరలిస్తున్న రేషన్ బియ్యాన్ని కావలి రూరల్ మండలం మద్దూరుపాడు క్రాస్ రోడ్డు వద్ద పోలీసులు పట్టుకొన్నారు. లారీలో ప్రకాశం జిల్లా నుంచి వస్తున్న ఈ బియ్యాన్ని నెల్లూరు కొత్తకాలువ ప్రాం తంలో గల ఒక రైస్‌మిల్లుకు తరలిస్తున్న సమాచారం అందుకొన్న రూరల్ పోలీసులు మాటువేసి లారీని పట్టు కోవడంతో అక్రమ తరలింపు వ్యవహారం గట్టురయ్యింది. తెల్ల గోనె సంచులలో నింపిన 180 బస్తాల రేషన్ బియ్యాన్ని పోలీసులు ఈ సందర్భంగా స్వాధీనం చేసుకొన్నారు. గత కొంతకాలంగా కావలి కేంద్రంగా రేషన్ బియ్యం అక్రమ రవాణా జరుగుతున్నట్లు సమాచారం. ఈ నేపథ్యంలో పట్టు బడిన బియ్యంలో కొంత కావలిలో దింపేందుకు ప్రయ త్నించినట్లు తెలుస్తోంది. పోలీసులు సమాచారం అందించ డంతో తహశీల్దార్ వెంకటేశ్వర్లు పట్టుబడిన బియ్యాన్ని స్వాధీ నం చేసుకొన్నారు. ఈ సమాచారం అందుకున్న స్థానిక శాసన సభ్యుడు బీద మస్తాన్‌రావు స్టేషన్‌కు విచ్చేసి ఎస్ఐ గిరిధర్, కానిస్టేబుల్ వినోద్‌లను అభినందించి ఐదు వేల రూపాయల నగదు బహుమతిని అప్పటికప్పుడు అందించారు. ఈ సంద ర్భంగా ఆయన మాట్లాడుతూ పేదల ఆకలి తీర్చేందుకు ప్రభు త్వం అందిస్తున్న రేషన్ బియ్యం అక్రమంగా తరలించడం అన్యాయమని, దీనికి బాధ్యులైన వారిని కఠినంగా శిక్షించా లని కోరారు.

# ఇస్కపల్లి పిహెచ్‌సి పరిస్థితి ఘోరం!

- **ఎమ్మెల్యే తనిఖీలో తేలిన నిజం**

అల్లూరు మండలం ఇస్కపల్లి ఆరోగ్య కేంద్రాన్ని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు ఇటీవల ఆకస్మిక తనిఖీ చేశారు. ఆస్పత్రి అంతా అపరిశుభ్రతతో వుండడం, చెత్తచెదారాలు, వ్యర్థాలు పడి వుండడంతో ఎమ్మెల్యే ఆగ్రహించారు. ఆరోగ్య కేంద్రాన్ని ఇలాగేనా వుంచుకొనేది అని సిబ్బందిని నిలదీశారు. అక్కడకు వచ్చే రోగులకు సరైన వైద్య చికిత్సలు అందకపోవడంపై మండిపడ్డారు. డ్యూటీ డాక్టర్ లేకపోవడంతో ఆమె గురించి ఆరా తీయగా మీటింగ్‌కు పోయిందని సిబ్బంది సమాధానం ఇచ్చారు. పారి శుధ్యం క్షీణించడంపై సిబ్బంది వివరణ ఇస్తూ పారిశుధ్య సిబ్బంది లేనందున బయటి వ్యక్తుల చేత చేయించుకొంటున్నామని ఎమ్మెల్యే దృష్టికి తీసుకొని వచ్చారు. ఎంతమంది రోగులు వచ్చారని అడగ్గా సిబ్బంది తప్పుడు లెక్కలు చెప్పడంతో ఓపి రిజిస్టర్ తీసుకొని చూడగా అందులో తేడా వుండడంతో ఎమ్మెల్యే ఆగ్రహంతో ఊగిపోయారు. జిల్లా వైద్యా ధికారితో ఆరోగ్య కేంద్రంలో వైద్య సేవలు సరిగా అందడంలేదని ఫిర్యాదు చేశారు.

# వైద్యం వికటించి మహిళ మృతి!

## గూడూరు డాక్టర్‌పై కేసు నమోదు

సైదాపురం మండలానికి చెందిన ఒక మహిళకు సరైన చికిత్స అందని కారణంగా మృతి చెందడంతో వివాదం నెలకొనింది. వైద్యురాలు తగిన వైద్యం అందించని కారణంగానే మహిళ మృతి చెందిందని ఆమె కుటుంబ సభ్యులు ఆందోళనకు దిగడం, ఆస్పత్రి నిర్వాహకులు రాజీకి రావడంతో చివరకు వివాదం సద్దుమణిగింది. దీనికి సంబంధించిన వివరాలు ఇలా వున్నాయి. సైదాపురం మండలం వేములచేడు పంచాయితీ పాతాళపల్లికి చెందిన దేవళ్ల మోహనమ్మ గత కొంతకాలంగా గర్భకోశ వ్యాధితో బాధపడుతోంది. చికిత్స నిమిత్తం ఆమెను భర్త శ్రీనివాసులు గూడూరు బాలాజీనగర్‌లోని అన్వేష్ తల్లిపిల్లల ఆస్పత్రిలో చేర్పించారు. స్థానిక ప్రభుత్వ వైద్యశాలలో డాక్టర్‌గా పని చేస్తున్న తనూజ ఈ ఆస్పత్రిని నిర్వహిస్తూ వుంది. కుటుంబ సభ్యుల అంగీకారంతో ఆపరేషన్‌కు సిద్ధమయ్యింది. శస్త్రచికిత్స నిర్వహించే సమయంలో మత్తు మందు ఇచ్చేందుకు సంబంధిత నిపుణుడు లేకపోవడంతో ఆమె స్వయంగా ఆ ప్రక్రియ పూర్తి చేసిందట. తర్వాత ఆ మహిళకు తీవ్ర రక్తస్రావం జరిగి అపస్మారక స్థితికి వెళ్లడంతో సరైన వైద్య పరికరాలు లేనందున మెరుగైన చికిత్స కోసం నెల్లూరు నారాయణ హాస్పిటల్‌కు తరలించాలని చెప్పి డాక్టర్ తనూజ స్వయంగా పేషంట్‌ను తీసుకొని వచ్చి చేర్పించి చేతులు దులుపుకొంది. నారాయణలో చేరిన మోహనమ్మ మృతి చెందడంతో, దీనికి సరైన వైద్యం చేయని తనూజ కారణమని తెలుసుకొని ఆమె కుటుంబసభ్యులు గూడూరుకు వచ్చి తనూజ హాస్పిటల్ ముందు ఆందోళనకు దిగారు. ఈ వివాదం పెద్దది కావడంతో ఆప్పత్రి నిర్వాహకులు మృతురాలి కుటుంబసభ్యులతో రాజీ కుదుర్చుకొన్నారు. 2.15లక్షలు చెల్లించేలా మాట్లాడుకొని, తక్షణం మృతదేహాన్ని ఖననం చేసేలా ఒప్పందం చేసుకొన్నారట. సమాచారం అందుకొన్న పోలీసులు మాత్రం వైద్యశాల నిర్వాహకుడు పాటూరు రాజమహేంద్రరెడ్డిని విచారించి, జరిగిన ఘటనపై సుమోటోగా కేసు నమోదు చేసి దర్యాప్తు చేస్తున్నారు.

# కొత్తదారులు వెతుకుతున్నారు!

## ● ఎర్రచందనం స్మగ్లర్లు భలే బిజీ

వెంకటగిరి ప్రాంతం వెలుగొండ అడవుల నుంచి ఎర్రచందనం స్మగ్లింగ్ భారీగా జరుగుతోంది. అధికారుల నిఘా ఇటీవల కాలంలో అధికం కావడంతో స్మగ్లర్లు ఎత్తులకు పైఎత్తులు వేస్తూ కొత్త మార్గాలలో స్మగ్లింగ్ జరుపుతున్నారు. అందుకోసం చిన్న వాహనాలను ఇటీవల కాలంలో అధికంగా వినియోగిస్తున్నారు. చిన్న వాహనాలు అయితే చిన్న చిన్న దారుల్లో సైతం సులభంగా వెళ్లే వీలుండడంతో వీటినే ఎక్కువగా వాడుతున్నారు. ఇటీవల అటవీశాఖ అధికారులు పట్టుకొన్న వాహనాలను గమనిస్తే ఈ విషయం తేటతెల్లం అవుతుంది. సుమోలు, ఆటోలు, కార్లు, మినీలారీలే పట్టుబడిన వాటిలో వున్నాయి. అధికారులు ఈ విషయాన్ని రూఢీ చేస్తున్నారు. వెలుగొండ నుంచి ఎర్ర చందనాన్ని నేరుగా తరలించకుండా ఒక చోట డంప్ చేసి అదను చూసి తరలిస్తున్నారు. ఇటీవల కూర్జాగుంట వద్ద వున్న ఎర్రచందనం డంప్‌పై అటవీశాఖ, పోలీస్ అధికారులు దాడులు చేసి భారీగా దుంగలను స్వాధీనం చేసుకొన్నారు. విదేశాలలో ఎర్రచందనానికి మంచి డిమాండ్ వుండడంతో రైతు కూలీలను దుంగల నరికివేతకు వినియోగించుకొని వారికి అధిక మొత్తంలో కూలీగా చెల్లిస్తున్నట్లు సమాచారం. అధికారులు కఠిన చర్యలు చేపడుతుంటే దానికి తగినట్లు స్మగ్లర్లు కొత్త ఎత్తులు వేస్తుండడంతో స్మగ్లింగ్ నిరాటంకంగా జరిగిపోతుంది.

## ● బోగోలు చెరువు

# మరమ్మత్తులకు నిధులు!

## మంజూరు చేయించిన ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు

బోగోలు పంచాయితీ పరిధిలోని చెరువు శాశ్వత అభివృద్ధికి నిధులు మంజూరు అయ్యాయి. ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు చొరవతో 98లక్షల రూపాయలు మంజూరయ్యాయి. గతంలో సంభవించిన తుఫాన్లకు బోగోలు చెరువుకట్ట పూర్తిగా ధ్వంసమైపోయింది. ఆనాటి నుంచి దాదాపు ఎనిమిది సంవత్సరాలపాటు శాశ్వత అభివృద్ధికి నోచుకోలేదు. అధిక వర్షం పడినపుడు చెరువులోని నీరు బయటకు వెళ్లిపోతూనే వుంది. ఈ కారణంగా ఆయకట్టు క్రింద వున్న పంటపొలాలకు నీరు అందని పరిస్థితి ఏర్పడింది. వందల ఎకరాల్లో సాగు చేసే రైతులు దీని వలన సాగు చేసుకోలేని పరిస్థితి ఏర్పడుతోంది. దీనిపై పలుమార్లు రైతులు ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డికి విన్నవించినా ఫలితం లేకుండా పోయింది. ఈ పరిస్థితుల్లో ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు రైతుల అగచాట్లు తెలుసుకొని చెరువుకు రింగ్‌బండ్ వేయించేందుకు నిధులు మంజూరు చేయించడంతో రైతులు హర్షం వ్యక్తం చేస్తున్నారు.

# గూడూరు ఆర్టీసిలో తిష్టవేసిన సమస్యలు!

గూడూరులోని ఆర్టీసి బస్టాండు సుందర ముదనష్టంగా తయారయ్యింది. పొంగి పొర్లుతున్న మురుగు, దుర్వాసన వెదజల్లుతున్న మరుగుదొడ్లు, ఎక్కడ చూసినా చెత్తా చెదారాలతో అపరిశుభ్ర వాతావరణం తాండవిస్తోంది. చుట్టుప్రక్కల ప్రాంతాలకు రాకపోకలు సాగించేందుకు ప్రయాణీకులు బస్టాండ్‌కు వస్తుంటారు. పారిశుధ్యం క్షీణిస్తున్నా, దుర్గంధం వెదజల్లుతున్నా ఆర్టీసి అధికారులు పట్టించుకోకపోవడంతో బస్టాండు అధ్వాన్నంగా మారింది. ఇక అన్ని బస్సులు ఇక్కడకు రావడం లేదు. బైపాస్ రైడర్లతోపాటు సాధారణ ఎక్స్‌ప్రెస్ సర్వీసులు సైతం బస్టాండులోకి రాకుండా బైపాస్ రోడ్డులోనే దించేసి వెళ్తుండడంతో ప్రయాణీకులు ఇబ్బంది పడుతున్నారు. ఇక్కడి అంగళ్లలో ప్రతి వస్తువు, ఆహార పదార్థాలు అధిక ధరలకు విక్రయిస్తున్నా పట్టించుకొనే నాధుడే లేకుండా పోయారు. ప్రయాణీకులు ఇదేమిటని ప్రశ్నిస్తే షాపుల యజమానులు వారితో గొడవలకు దిగుతుండడంతో అధిక ధరలకే కొనుగోలు చేయాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. బస్టాండ్ ఆవరణలో గల సెప్టిక్ ట్యాంకు పొంగి మురుగు బయటకు వస్తున్నా గత్యంతరంలేని పరిస్థితుల్లో ఆ మురుగు వాతావరణంలోనే తిరగాల్సి రావడంతో ప్రయాణీకులు నరకయాతన పడుతున్నారు. ఇక వాహనాల పార్కింగ్‌కు ఏర్పాటు చేసిన స్థలంలో షెడ్లు లేకపోవడంతో ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ వాహనాలు వుండాల్సి వస్తుండడంతో యాజమానులు

## అల్లాడుతున్న ప్రయాణీకులు

ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ముక్కుపిండి పార్కింగ్ ఫీజు వసూలు చేసేవారికి ఇవేమీ పట్టకపోవడం విశేషం. ఇక ఆటోల సంగతి సరేసరి. బస్టాండు ముందు అడ్డదిడ్డంగా ఆటోలను నిలుపుతుండడంతో బస్టాండు వద్ద నిత్యం ట్రాఫిక్ జామ్ అవుతోంది. ఈ సమస్యలన్నింటిపై డిపో మేనేజర్‌కు తెలియజేస్తే చూస్తాం, చేస్తాం అంటున్నారు తప్పితే సమస్య పరిష్కరించడం లేదని ప్రయాణీకులు వాపోతున్నారు.

● విదేశీ పెట్టుబడులకు రెడ్‌కార్పెట్ పరచడంతో...

# దేశీయ చిల్లర వర్తకం చిందరవందర గందరగోళం!

చిల్లర వర్తకంలోకి విదేశీ పెట్టుబడులను అనుమతించింది కేంద్ర ప్రభుత్వం. చిల్లర వర్తకం అంటే చాలా విస్తృతమైన అర్థం వుంది. మన ఇంటి పక్కన, వీధి చివర, బజారులో వుండే ప్రతి అంగడీ చిల్లర వర్తకమే. కూరగాయలు, పండ్లు, ఉప్పు, పప్పు వంటి ఫలసరకులు, చెప్పులు, వస్త్రాలు, టీవీలు, సెల్ ఫోన్లు, ఆట బొమ్మలు, వంటింటి సామాను, ఫర్నీచర్, ఫ్యాన్సీ వస్తువులు... ఇట్లా ప్రజలు వాడే ప్రతి వస్తువూ దీని క్రిందకే వస్తుంది. మన దేశంలో దాదాపు కోటిన్నర చిల్లర అంగళ్లు వుంటాయని అంచనా. వాటి మీద ఆధారపడి కనీసం నాలుగు కోట్ల మందికిపైగా బ్రతుకు


వాల్‌మార్ట్ సూపర్‌మార్కెట్‌లో ఎలక్ట్రానిక్ వస్తువులు.

తున్నారని వూహ. దేశం మొత్తం మీద చిల్లర వర్తకం విలువ 25లక్షల కోట్ల రూపాయలని ఆర్థిక నిపుణుల భావన. రానున్న ఒకటి రెండు దశాబ్దాలలో ఈ వ్యాపార పరిణామం 50లక్షల కోట్ల రూపాయలు దాటుతుందని వూహిస్తున్నారు. పూర్తిగా అవ్యవస్థీకృత రంగంలో వున్న వ్యాపారం ఇది. ఏ ఉద్యోగమూ దొరకక పోతే లేదా ఉద్యోగం చేయడం ఇష్టం లేకపోతే ఏదో ఒక అంగడి పెట్టుకోవడం మన సంస్కృతి. అందువల్లనే ప్రతి వెయ్యి మంది జనాభాకు 11 చిల్లర అంగళ్లు వున్నాయని ఒక పరిశీలనలో లెక్క తేలింది. దాన్నిబట్టి దేశంలో ఈ వర్తకం ప్రాధాన్యత, ప్రభావం ఎంత గాఢమైనవో అర్థం చేసుకోవచ్చు.

## కోటి మందికి ఉద్యోగాలు!

అంత కీలకమైన రంగంలోకి విదేశీ పెట్టుబడులను అనుమతిస్తున్నారిప్పుడు. దాని అర్థం - ప్రతి చిల్లర అంగడి వస్తువునూ భారీ సూపర్ మార్కెట్‌లో అమ్మే స్వేచ్ఛ ఇవ్వడం. ఈ అనుమతి వల్ల దేశంలోకి బిలియన్ డాలర్ల పెట్టుబడి తరలి వస్తుందని, రానున్న పదేళ్లలో కనీసం కోటి మందికి ఉద్యోగాలు లభిస్తాయని ప్రధాని అభిప్రాయపడుతున్నారు. అందువల్లనే మమతా బెనర్జీ వంటి మిత్ర పక్షం తన ప్రభుత్వానికి మద్దతు ఉపసంహరించినా, పార్లమెంట్ వర్షాకాల సమావేశాలు మొత్తం ప్రతిపక్షాల అల్లరితో వృధా అయిపోయినా, ఎంత మంది ఎన్ని రకాల అభ్యంతరాలు చెప్తున్నా లెక్క చేయకుండా దీన్ని అమలు చేయడానికి సిద్ధపడుతున్నాడు.

## ఏది నిజం

ప్రధాని కోరేది దేశ హితం. ప్రతిపక్షాలు కోరేది కూడా దేశ హితమే. అయితే ఇద్దరిలో ఎవరు చెప్పేది నిజం అనేది అసలు సమస్య. దీనిపై దేశ వ్యాప్తంగా విస్తృత స్థాయి చర్చ నడుస్తున్నది. వాదోపవాదాలు కొనసాగుతున్నాయి. వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు, నిపుణులు పరస్పర విరుద్ధ అభిప్రాయాలు వెలువరిస్తున్నారు. వీటన్నిటి వల్ల ప్రజలు మరింత గందరగోళానికి లోనౌతున్నారు. ఈ చర్చ మరింత లోతుగా జరిగి, ప్రజలకు విషయం పూర్తిగా అర్థమైన తర్వాత నిర్ణయం తీసుకొని వుంటే బాగుండేది. ప్రజాస్వామికంగా వుండేది. కానీ ప్రధాని మాత్రం ఈ విషయంలో నిరంకుశంగా వ్యవహరిస్తున్నాడు. నేను చెప్పేది నిజం, నేను చేసేది దేశ హితం, వద్దని చెప్పే వారందరూ అభివృద్ధి నిరోధకులని గద్దిస్తున్నాడాయన.

## లాభ నష్టాలు

ఇంతకూ తెల్ల దొరలకు చిల్లర అంగళ్లు అప్పచెప్పడం వల్ల ప్రజలకు జరిగేది మేలా? కీడా? ఒక్క మాటలో సమాధానం చెప్పలేని ప్రశ్న ఇది. ఇందులో కొన్ని లాభాలున్నాయి, కొన్ని నష్టాలున్నాయి. లాభం కంటే నష్టం ఎక్కువా, నష్టం కంటే లాభం ఎక్కువా అన్నదే తేల్చుకోవాలి.

1960 దశకం వరకు అమెరికా, ఐరోపా దేశాలలో కూడా మన వలెనే వీధి చివర చిల్లర అంగళ్లు విరివిగా వుండేవి. ప్రజలు తమ నిత్యావసరాల కోసం వాటి మీదనే ఆధారపడే వారు. కానీ 1962లో వాల్‌మార్ట్ రంగ ప్రవేశంతో పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ఇప్పుడు ఐరోపా దేశాలలో నూటికి 90 శాతం చిల్లర వర్తకం వాల్‌మార్ట్, కె స్టోర్, టార్గెట్, టెస్కో వంటి భారీ సంస్థలు చిల్లర వర్తకం మొత్తాన్ని తమ గుప్పెటలోకి తెచ్చుకొన్నాయి. అయితే విచిత్రం - యాభై ఏళ్ల తర్వాత కూడా అమెరికాలో వాల్‌మార్ట్‌కు ప్రతిఘటనలు ఎదురౌతూనే వున్నాయి. న్యూయార్క్ సిటీలో వాల్‌మార్ట్


వాల్‌మార్ట్ సూపర్‌మార్కెట్‌లో పాల ఉత్పత్తులు.

స్టోర్ పెట్టరాదని ఆ నగర మేయర్ ఆదేశించాడంటే, దాని పట్ల అక్కడి ప్రజలలో వుండే వ్యతిరేక భావాన్ని అర్థం చేసుకోవచ్చు.

## చైనాలో ఘనస్వాగతం

అయితే చైనాలో మాత్రం కమ్యూనిస్టు ప్రభుత్వం వాల్‌మార్ట్‌కు రెడ్ కార్పెట్ పరచి మరీ స్వాగతం చెప్పింది. అందుకు కారణం - వాల్‌మార్ట్ అమ్మే వస్తువులలో 45శాతం వరకు చైనాలో తయారైనవి కావడం. ప్రజలు విరివిగా వాడే వస్తువులను అత్యంత చవకగా తయారు చేయించడం ద్వారా చైనా ప్రభుత్వం అంతర్జాతీయ వాణిజ్యంలో సింహభాగాన్ని తన స్వంతం చేసుకొన్నది. వాల్‌మార్ట్ వంటి సంస్థల వల్లనే చైనాలోని పరిశ్రమలు వృద్ధి చెందగలుగుతున్నాయి. తమ పారిశ్రామిక ఉత్పత్తులకు వాల్‌మార్ట్ మార్కెట్ సృష్టిస్తున్నది. కాబట్టి, వారు తమ దేశంలో వ్యాపారం చేయకుండా అడ్డుకొనేందుకు చైనా ప్రభుత్వం సాహసించలేదు.

## అమెరికాలో మన వస్తువులు కొనరు

కానీ భారతదేశం పరిస్థితి అది కాదు. అమెరికన్ సూపర్ మార్కెట్లలో కనీసం ఒక శాతం వస్తువుల మీద కూడా మేడ్ ఇన్ ఇండియా అనే ముద్ర వుండదు. మనం తయారు చేసే ఏ వస్తువునూ వారు కొనరు. మనం ఉత్పత్తి చేసే ఏ ఆహార పదార్థాన్నీ వారు వాడరు. కానీ వారి వ్యాపారం కోసం

| లాభాలు | నష్టాలు |
|---|---|
| 1. పోటీ వాతావరణం వల్ల న్యాయమైన ఉత్పత్తులు తక్కువ ధరలో వినియోగదారుడికి లభిస్తాయి. | 1. చిల్లర అంగళ్లు నడుపుకొనేవారు సూపర్‌మార్కెట్లతో ధరలలో, వస్తువుల నాణ్యతలో పోటీ పడలేక దివాలా తీస్తారు. |
| 2. ప్రపంచ స్థాయి ఉత్పత్తులు సామాన్యుడికి అందుబాటులోకి వస్తాయి. | 2. చిల్లర అంగళ్లు మూతపడే వరకు రెండు లేదా మూడు సంవత్సరాల పాటు సూపర్‌మార్కెట్లు నష్టం వచ్చినా తక్కువ ధరకు అమ్మే శక్తి కలిగి వుంటాయి. |
| 3. విదేశాల నుంచి వేల కోట్ల రూపాయల పెట్టుబడి తరలి వస్తుంది. | 3. చిల్లర వ్యాపారంలో గుత్తాధిపత్యం పెరిగిపోతుంది. దాని వల్ల దీర్ఘకాలంలో వినియోగదారుడు అధిక ధరలు చెల్లించక తప్పదు. |
| 4. ఆహార వస్తువుల ఉత్పత్తి, ప్రాసెసింగ్, ప్యాకింగ్, రవాణా, గోడౌన్ల వంటి వాటిలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులోకి వస్తుంది. | 4. ఏ ఉద్యోగమూ దొరకని వాడు చిన్న పెట్టుబడితో చిల్లర అంగడి పెట్టుకోవడం మనకు అలవాటు. ఇక అటువంటి ఉపాధి అవకాశాలు మిగలవు. నిరుద్యోగం పెరిగిపోతుంది. |
| 5. నిపుణులైన యువతరానికి ఉపాధి అవకాశాలు పెరుగుతాయి. | 5. వాల్‌మార్ట్ వంటి సంస్థలు ఇచ్చే ఉద్యోగాలు ఎక్కువ, వాటి వల్ల మూతపడే చిల్లర అంగళ్లలో ఉద్యోగాలు కోల్పోయే వారి సంఖ్య ఇంకా ఎక్కువ. |
| 6. దీర్ఘకాలంలో వ్యవసాయ, చిన్న పరిశ్రమల రంగాలు నవీన సాంకేతిక పరిజ్ఞానం ప్రవేశంతో శీఘ్రంగా అభివృద్ధి చెందుతాయి. | 6. వ్యవసాయ రంగంలో చిన్న రైతులు సూపర్‌మార్కెట్లు అడిగే నాణ్యతా ప్రమాణాలు పాటించలేరు. |

మన దేశంలోని రైతులను, చిల్లర వర్తకులను నష్టపొమ్మని చెప్తున్నాడు ప్రధానమంత్రి.

చిల్లర వర్తకంలో విదేశీ పెట్టుబడుల వల్ల ప్రధానంగా రెండు సమస్యలు తలెత్తుతాయి. మొదటిది - కోట్ల సంఖ్యలో వున్న చిల్లర వర్తకులు తమ వ్యాపారం కోల్పోయి వీధిన పడడం; రెండవది - వ్యవసాయ రంగంలో వచ్చే మార్పులకు రైతాంగం తీవ్రంగా ప్రభావితం కావడం.

## ఎక్కడ చౌకగా ఉంటే అక్కడ కొనుగోలు

విదేశీ సూపర్ మార్కెట్లు తమ మొత్తం వస్తువులలో 30శాతం వరకు మాత్రమే మన దేశంలోని రైతులు, చిన్న పరిశ్రమల నుంచి సేకరించాలి. తతిమా 70 శాతం వస్తువులను విదేశాల నుంచి దిగుమతి చేసుకోవచ్చు. దానివల్ల ఏ దేశంలో


దేశీయ చిల్లర అంగడి.

ఎప్పుడు ఏ వస్తువు చవకగా వుంటే అక్కడ నుంచి తెప్పించుకొంటారు. వియత్నాం నుంచి బియ్యం, బ్రెజిల్ నుంచి కందిపప్పు, ఇజ్రాయిల్ నుంచి టమోటాలు, హాలెండ్ నుంచి పాలు, థాయిల్యాండ్ నుంచి చేపలు, చైనా నుంచి చెప్పులు, వస్త్రాలు, ఆట బొమ్మలు, వంటింట్లో వాడే స్టీలు గిన్నెలు, బాండళ్లు, గ్యాస్ పొయ్యిలు... ఇట్లా వుంటుంది సూపర్‌మార్కెట్ల సేకరణ. మరొకప్రక్క పరిశ్రమల నుంచి పెద్ద మొత్తంలో కొనుగోలు చేస్తారు కాబట్టి, చవక ధరలకు లభిస్తాయి. వారితో పోటీ పడడం వీధి చివర వుండే ప్రొవిజన్ స్టోర్ యజమానికి సాధ్యం కాదు. ఆ ధరకూ ఇవ్వలేడు, ఆ నాణ్యతా పాటించలేడు. దానితో వారి అంగళ్లు మూతపడతాయి. దానిపైనే ఆధారపడి వున్న కుటుంబాలు కుప్పకూలి పోతాయి. చిల్లర వ్యాపారం చేసేవాడు వేరే వారి దగ్గర ఉద్యోగం చేయలేడు. కొత్త వ్యాపకం ఎంచుకోలేడు. దాదాపు నాలుగు కోట్ల మంది భవిష్యత్తు ప్రమాదంలో పడుతుంది.

## రైతులకు కష్టాలు

వ్యవసాయ రంగం మీద వాల్‌మార్ట్ వంటి

కొరవ 16వ పేజీలో

# అనంతపద్మనాభ వ్రతంతో అష్టైశ్వర్యాలు!



మనం ఆచరించే వ్రతాలలో అనంత పద్మనాభ వ్రతం ఒకటి. దీనినే అనంత వ్రతం అంటారు. అనంతుడు అనేది శ్రీమహావిష్ణువుకు వున్న పేర్లలో ఒకటి. భాద్రపద శుక్ల చతుర్దశినాడు ఈ వ్రతాన్ని జరుపుకొంటారు. అనేక వ్రతాలు ఉన్నప్పటికీ కామ్య వ్రతాలలో అనంత పద్మనాభ వ్రతం ప్రధానమైనదిగా వ్రత గ్రంధాలు పేర్కొంటున్నాయి. ఈ వ్రతాన్ని గురించి స్వయంగా శ్రీకృష్ణభగవానుడే తెలియజేసినట్లు భవిష్యపురాణంలో చెప్పబడింది. వనవాస సమయంలో తాము అనుభవిస్తున్న కష్టాలను చెప్పి, వాటి నుంచి విముక్తి లభించే మార్గం చెప్పమని పాండవాగ్రజుడైన ధర్మరాజు శ్రీకృష్ణుని కోరగా అప్పుడు ఈ వ్రతం గురించి వివరించాడట. దీనిని గురించి విన్న ధర్మరాజు అసలు అనంతుడంటే ఎవరు? అని అడుగగా అనంతుడన్నా, అనంత పద్మనాభస్వామి అన్నా సాక్షాత్తు కాలమే అన్నాడు. యుగ, సంవత్సర, మాస తదితర కాలమంతా ఆయన స్వరూపమేనని, కాలపురుషుడే అనంతుడని చెప్పి అది నేనే అని శ్రీకృష్ణుడు చెప్పాడట. పాలకడలిలో శేషశయ్య మీద పవళించి వున్న దివ్యమంగళ స్వరూపమే అనంత పద్మనాభుడు.

ఈ వ్రత మహత్యం గురించి భవిష్య పురాణంలో వివరించబడింది. దీని ప్రకారం కృతయుగంలో సుమంతుడు – దీక్ష అనే దంపతులు వుండేవారు. దీక్ష భృగు మహర్షి కూతురు. వీరికి సుశీల అనే కుమార్తె జన్మించింది. ఆమెను కౌండిన్యుడు వివాహం చేసుకొన్నాడు. వివాహం జరిగాక సుశీలతో కలసి ఆశ్రమానికి వస్తూ దారిలో ఒక నదీ తీరంలో కొంతసేపు విశ్రమించాడు కౌండిన్యుడు. ఆ సమయంలో నది తీరంలోగల కొందరు స్త్రీలు ఏదో వ్రతం చేస్తుండడాన్ని గమనించిన సుశీల వారి వద్దకు వెళ్లి అనంత పద్మనాభ వ్రతం గురించి తెలుసుకొని, తాను ఆ వ్రతాన్ని ఆచరిస్తుంది. చేతికి తోరాన్ని ధరించి భర్తతో కలసి సాయంత్రం ఆశ్రమానికి చేరింది. వ్రతం ఆచరించిన ఫలితంగా వారికి అష్టైశ్వర్యాలు కలిగాయి. కొన్ని రోజుల తర్వాత కౌండిన్యుడు తన భార్య చేతికి వున్న తోరమును చూసి అనుమానించి నన్ను వశం చేసుకొనేందుకే నీవు దీనిని ధరించావని ఆమెపై కోపించి దాన్ని తెంపి నిప్పుల్లో పడేశాడు. దాని ఫలితంగా అష్టైశ్వర్యాలు పోయాయి. తప్పు తెలుసుకొన్న కౌండిన్యుడు అనంతుడి గురించి వెతుకుతూ అడవుల వెంట తిరగసాగాడు. అతడికి దారిలో మామిడి చెట్టు, పచ్చగడ్డి మేయకుండా తిరుగుతున్న ఆవు, పచ్చికబీడుపై పడుకొని వున్న ఎద్దు, నిండుగా వున్న సరోవరాలు, గాడిద, ఏనుగులు వరుసగా కన్పించాయి. పద్మనాభుడి గురించి వాటిని అడుగగా ఆయనెవరో మాకు తెలియదని చెప్పాయి అవి. అడవిలో



తిరిగి తిరిగి మూర్ఛపోయిన కౌండిన్యుడు చివరకు ప్రాణ త్యాగానికి సిద్ధపడగా, ఒక వృద్ధ బ్రాహ్మణుడు కౌండిన్యుడి ముందు ప్రత్యక్షమై అతన్ని గుహలోనికి తీసుకొనిపోయి అనంత పద్మనాభునిగా దర్శనమిచ్చాడు. అప్పుడు కౌండిన్యుడు ఆయన పాదాలపై పడి తప్పు క్షమించమని వేడుకొని ప్రాయశ్చిత్తం చెప్పమని ప్రాధేయపడ్డాడు. ప్రతి సంవత్సరం భాద్రపద శుక్ల చతుర్దినాడు అనంత పద్మనాభ వ్రతాన్ని ఆచరించమని, అలా 14ఏళ్లు చేస్తే కష్టాలు తొలగి అనంత సౌఖ్యాలను పొందుతావని అనంతపద్మనాభ స్వామి చెప్పి అంతర్ధానమైనాడు. ఆశ్రమానికి తిరిగి వచ్చిన కౌండిన్యుడు అనంత వ్రతాన్ని ఆచరించి సుఖ: సంతోషాలతో కాలం గడిపారు.

వ్రతం ఆచరించే ముందు శుచిగా స్నానం చేసి గృహాన్ని, పూజా మందిరాన్ని శుభ్రపరచుకోవాలి. పూజా మందిరంలో అష్టదళ పద్మాన్ని చిత్రించి, ముగ్గులు పెట్టి వీటి మధ్యలో దర్భలతో చేసిన అనంత పద్మనాభ స్వామిని వుంచి, కుడివైపు నీటితో నింపిన కలశాన్ని వుంచాలి. స్వామిని ఆవాహన చేసి పద్నాలుగు ముడులను వేసి కుంకుమతో తడిపిన తోరాన్ని స్వామి చెంత వుంచి పూజించాలి. తర్వాత ఆ తోరాన్ని కుడిచేతికి కట్టుకోవాలి. ఈ వ్రతంలో యమునా దేవినీ పూజిస్తారు. వ్రత కథ చెప్పుకొని అనంత పద్మనాభస్వామికి నమస్కరించి నైవేద్యం సమర్పించాలి. ఈ వ్రతం చేయడం వలన దారిద్ర్యం తొలగి ఐశ్వర్యం లభిస్తుందని పురాణాలు చెప్తున్నాయి.

J

గురజాడ జయంతి

# గురజాడ అప్పారావు 150వ జయంతి

మహాకవి, సంఘ సంస్కర్త గురజాడ అప్పారావు 150వజయంతి ఉత్సవాలు ఘనంగా జరిగాయి. నగరంలోని పురమందిరంలో జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో నిర్వహించిన గురజాడ అప్పారావు జయంతి కార్యక్రమానికి పలువురు రచయితలు, కవులు, కళాకారులతోపాటు అధికారులు హాజరైనారు. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిధిగా విచ్చేసిన జిల్లా ఎస్పీ బి.వి.రమణకుమార్ మాట్లాడుతూ నేటి చిన్నారులే రేపటి భావిభారత పౌరులుగా ఎదగాలన్నారు. గురజాడ వంటి మహాకవి మన మధ్య లేకున్నా ఆయన జయంతిని మనం జరుపుకొంటూ ఆదర్శంగా తీసుకోవాలని కోరారు. నేటి తరం విద్యార్థులు మాజీ రాష్ట్రపతి అబ్దుల్‌కలాం లాంటి వారిని ఆదర్శంగా తీసుకొని ఉన్నత స్థాయికి ఎదగాలన్నారు.

ఉన్నత స్థాయికి చేరిన వారు దేశకీర్తిని దేశ విదేశాలలో చాటాలని ఆయన కోరారు. ఈ కార్యక్రమానికి నెరసం అధ్యక్షులు ఎ.జయప్రకాష్ అధ్యక్షత వహించగా, ముఖ్యఅతిధులుగా మెట్టు రామచంద్రప్రసాద్, హెల్పింగ్ హ్యాండ్స్ కృష్ణారెడ్డి, ఆచార్య ఆదిత్య తదతరులు పాల్గొన్నారు. గురజాడ జయంతిని పురస్కరించుకొని నిర్వహించిన వ్యాసరచన పోటీలో పాఠశాలల విద్యార్థులు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. ఈ పోటీలలో గెలుపొందిన వారికి ప్రశంసాపత్రాలను నిర్వాహకులు అందజేశారు.

## సాహితీ మిత్రమండలి ఆధ్వర్యంలో

సాహితీ మిత్రమండలి ఆధ్వర్యంలో గురజాడ అప్పారావు 150వ జయంతిని నగరలోని నవీన్ డయాబెటిక్ క్లినిక్‌లో నిర్వహించారు. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిధిగా విశ్రాంత అధ్యాపకురాలు గుర్రం జాషువా మనుమరాలు శోభాదేవి హాజరయ్యారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ అక్షర కోటీశ్వరుడు, సంఘసంస్కర్త, గురజాడ అప్పారావు సాహిత్యం గురించి వివరించారు. పురుషుడై వుండి కూడా స్త్రీల మనోభావాలను గౌరవించి, బాల్యవివాహాల రద్దుకు ఆయన చేసిన సాహసం మరచిపోలేనిదని అన్నారు. కార్యక్రమానికి సాహితీ మిత్రమండలి కన్వీనర్ డాక్టర్ ఈదూరు సుధాకర్ అధ్యక్షత వహించగా, చిన్ని నారాయణరావు, కాళిదాసు పురుషోత్తం, వంజివాక సతీష్ కుమార్ రెడ్డి, ఈతకోట సుబ్బారావు తదితరులు పాల్గొన్నారు.



గురజాడ అప్పారావు జయంతి సభలో మాట్లాడుతున్న ఎస్పీ రమణకుమార్.

# వారఫలాలు

తేది 29-09-2012 నుండి 5-10-2012 వరకు వృషభంలో గురు, కేతువులు; సింహంలో శుక్రుడు; కన్యలో రవి, బుధుడు 1తేది వరకు తదుపరి తులలో; తులలో శని; వృశ్చికంలో కుజ, రాహువులు; కుంభ, మీన, మేష, వృషభాలలో చంద్రుడు సంచరిస్తారు.




ఆర్థికస్థితి కొంత మెరుగ్గా వుంటుంది. ఆకస్మిక ప్రయాణాలు, బంధుమిత్రుల సమాగమం. నిరుద్యోగులకు నూతన అవకాశాలుంటాయి. శరీరారోగ్యం బాగుంటుంది. నూతన వ్యక్తుల పరిచయాలు లాభిస్తాయి. విద్యార్థులు విద్యపై ఆసక్తి కనబరస్తారు. వ్యవసాయదారులకు ఆదాయానికి తగ్గ ఖర్చులుంటాయి. రాజకీయులు నూతనోత్సాహంతో వుంటారు. పై వర్గాల గుర్తింపు వుంటుంది.




గతవారం మీద మేలుగా వుంటుంది. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోనివారి అడ్డంకులు తొలగి క్రమేణా పుంజుకుంటారు. సమాజంలో పరపతి, గౌరవం లభిస్తుంది. నూతన వస్తు, వాహనాలను కొనుగోలు చేస్తారు. విద్యార్థులకు స్వల్ప అనారోగ్య ఇబ్బందులుంటాయి. వ్యవసాయదారులకు శ్రమ అధికంగా వుంటుంది. ఆశించిన లాభాలు రాకపోవచ్చు. రాజకీయుల ప్రయత్నాలు నెరవేరుతాయి.




పనులు మందగిస్తాయి. ఆకస్మిక ప్రయాణాలు, ఇంట్లో బంధుమిత్రుల తాకిడి పెరుగుతుంది. ఒకవార్త మిమ్ములను సంతోషపెడుతుంది. ముఖ్య వ్యవహారాలు సానుకూలిస్తాయి. వృత్తి, వ్యాపారాలలోనివారు ఆర్థికంగా నిలదొక్కుకొంటారు. విద్యార్థుల విద్యపై ఆసక్తి కలిగివుంటారు. వ్యవసాయదారులు చిక్కులు తొలగి పురోగతి సాధిస్తారు. రాజకీయుల ఆత్మవిశ్వాసం పెరుగుతుంది.




ఆర్థిక ఇబ్బందులు తొలగి, పనులు సకాలంలో పూర్తయ్యి, కీర్తి ప్రతిష్టలు పెరుగుతాయి. నూతన వస్తువులను సమకూర్చుకొంటారు. వృత్తి, వ్యాపార, ఆర్థిక లావాదేవీలు అనుకూలంగా వుంటాయి. విద్యార్థులు నూతనోత్సాహంతో ముందుకు సాగుతారు. వ్యవసాయదారులకు లాభాలు అందుతాయి. కళా, క్రీడా రంగాలలోని వారికి విదేశీపర్యటనలు, సన్మానాలుంటాయి.




తలపెట్టిన పనులు పూర్తయ్యి, ఆర్థిక వ్యవహారాలు సంతృప్తినిస్తాయి. నూతన కార్యక్రమాలకు మంచి కాలం. ఉద్యోగులకు పై అధికారుల ప్రశంసలందుతాయి. విద్యార్థుల మనోస్థైర్యం పెరిగి, భవిష్యత్తుపై భరోసా కలుగుతుంది. వ్యవసాయదారులకు ఖర్చులు అదుపులో వుండకపోవచ్చు. కళా, క్రీడా రంగాలలోనివారు వృత్తిపరమైన ఇబ్బందులెదుర్కొంటారు.




ఆర్థికపుష్టి గతంకంటే మేలుగా వుంటుంది. నూతన పరిచయాలు లాభిస్తాయి. ఆధ్యాత్మిక సమావేశాలలో పాల్గొంటారు. కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తాయి. అవసరానికి డబ్బు చేతికందుతుంది. నూతన గృహనిర్మాణాది పనులకు అనుకూలమైన కాలం. విద్యార్థులు మానసిక ఒత్తిడితో చిరాకు, చికాగ్గా వుంటారు. వ్యవసాయదారులకు పనులలో ఆటంకాలు తప్పకపోవచ్చు.




తలపెట్టే కార్యక్రమాలు వాయిదా వేయడంగానీ, ఆగి ప్రయత్నించటం గానీ చేస్తే ఫలితముంటుంది. ఆర్థిక అసమానతలుంటాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థిక ఇబ్బందులుంటాయి. ఉద్యోగులకు పై అధికారులు అనుకూలంగా వుండకపోవచ్చు. విద్యార్థులు తమ ఉన్నత చదువులకై కఠిన సాధన అవసరం. వ్యవసాయదారులకు స్వల్ప ఆటంకాలెదురౌతాయి.




చేసే పనులు నిరాశ కలిగిస్తాయి. అయితే ఇంట్లో చేసే శుభకార్యయత్నాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపార రంగాల వారికి ఆర్థికపరమైన ఇబ్బందులు తొలగుతాయి. విద్యార్థులు స్వల్ప ప్రయత్నంలో తమ విద్యలను పూర్తి చేస్తారు. వ్యవసాయదారులకు పర్వాలేదనిపిస్తుంది. కళ, క్రీడా రంగాలలోనివారు ఎలాంటి పరిస్థితులలోనైనా ధైర్యంగా వ్యవహరిస్తారు. ఆర్థిక ఇబ్బందులుండవు.




ఈ రాశివారికి అంతా అనుకూలమే. నూతన వ్యక్తుల పరిచయంతో ప్రయోజనాలుంటాయి. వృత్తి, వ్యాపార రంగాల ఆర్థికస్థితి నిలకడగా వుంటుంది. విద్యార్థులు పోటీ పరీక్షలలో పాల్గొంటారు. బంధుమిత్రుల సహాయ సహకారాలుంటాయి. ఇంట్లో జరుగు శుభకార్యాలకు నూతన వస్తు, వాహనాభరణాలను కొంటారు. వ్యవసాయదారులు ఉత్సాహంగా తన పనులు పూర్తి చేస్తారు.




చేసే పనులు సానుకూలిస్తాయి. కుటుంబ సభ్యుల సలహా సహకారాలుంటాయి. ధైర్యంగా ముందుకుపోగలరు. వృత్తి, వ్యాపారాలలోని వారు తీసుకొనే నిర్ణయాలు మిమ్మలను ప్రత్యేకంగా నిలబెడుతుంది. ఉద్యోగులకు ఆకస్మిక స్థానచలనాలుంటాయి. విద్యార్థులు తమ శరీర అనారోగ్య సమస్యలను నిర్లక్ష్యం చేయవద్దు. వ్యవసాయదారులకు పనులలో ఆటంకాలేర్పడే అవకాశాలున్నాయి.




అన్ని వ్యవహారాలలో విజయం సాధిస్తారు. అన్ని వర్గాలకూ ఆర్థిక విజయం. ఆస్తి వివాదాలు పరిష్కారమౌతాయి. అయితే కొన్ని విషయాలలో తగు జాగ్రత్తలవసరం. బంధుమిత్రులతో కలసి విందు, వినోదాలు, శుభకార్యాలలో పాల్గొంటారు. వ్యవసాయదారులకు అధిక లాభాలు. కళ, క్రీడా రంగాలలోని వారు కీలక సమయంలో తీసుకొనే నిర్ణయం మిమ్మల్ని ప్రత్యేకంగా నిలబెడుతుంది.




ఈ రాశి వారికి శుభాశుభమిశ్రమంగా వుంటుంది. అనుకున్న విధంగా పనులు పూర్తి చేస్తారు. విద్యార్థులు పట్టుదలతో ముందుకుపోతారు. ఉద్యోగులకు పై అధికారులతో ఇబ్బందులు తప్పకపోవచ్చు. వ్యవసాయదారులకు ఆర్థిక వ్యవహారాలు సంతృప్తినిస్తాయి. కళ, క్రీడా రంగాలలోని వారికి కొన్ని విషయాలలో ఇతరులతో విభేదాలు పొడసూపే ఆస్కారముంది.

## పంచాంగం

29తేది ఉమామహేశ్వర వ్రతం.
30తేది మహాలయ పక్షారంభం.
2తేది గాంధీ జయంతి, ఉండ్రాళ్ల తద్దీ.
3తేది సంకటహర చతుర్థి, భరణీ మహాలయ – పితృతిథి.
5తేది వ్యతిపాత మహాలయ.

### శుభ ముహూర్తాలు

శూన్య మాసం మరియు మహాలయ పక్షం కావడంతో వివాహాది శుభకార్యాలకు ముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య శుభకార్యాలకు సుముహూర్తాలున్నాయి.

### సెప్టెంబరు తిథులు
#### నిజ భాద్రపద శుక్ల

| | | | | |
|---|---|---|---|---|
| 29 | శని | చతుర్దశి | ప | 08.02 గం.ల.వ |
| 30 | ఆది | పౌర్ణమి | ప | 08.47 గం.ల.వ |

### అక్టోబరు తిథులు
#### నిజ భాద్రపద బహుళ

| | | | | |
|---|---|---|---|---|
| 1 | సోమ | పాడ్యమి | ఉ | 10.02 గం.ల.వ |
| 2 | మంగళ | విదియ | ఉ | 11.46 గం.ల.వ |
| 3 | బుధ | తదియ | ప | 01.58 గం.ల.వ |
| 4 | గురు | చవితి | సా | 04.29 గం.ల.వ |
| 5 | శుక్ర | పంచమి | సా | 07.09 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.

# భారతీయ 'ఆగమ' ఆలయ వాస్తు నగర, ద్రవిడ, వేసరములను త్రివిధములు!

*జి.పూర్ణచంద్ర — తిరుపతి*

** నేను ఆగమ శాస్త్ర విద్యార్థిని. ఆలయ వాస్తు జాతిభేదములను గురించి చెప్పండి?*

అతి ప్రాచీనమైన 'మానసారం' గ్రంథంలో ఆలయ వాస్తు నాగర, ద్రవిడ, వేసరములను మూడు జాతి భేదములను ప్రస్తావించడం జరిగింది. మరికొన్ని వివరాల కోసం 'మానసారం' ఆంగ్లాను వాదం "యాన్ ఎమోషనల్ ఇండియన్ టెంపుల్ హిస్టరీ" చదవండి!

*పి.జయరాంనాయుడు — చిత్తూరు*

** గృహంలో చాలా సమస్యలున్నప్పుడు పరిష్కారమార్గం ఏమిటి?*

యంత్ర ప్రతిష్ట చేసుకొని, ఈశాన్యం కుంభ ప్రతిష్ట చేసుకోవడం మార్గమని గార్గ మహర్షి చెప్పారు.

*టి.విశాల — సైదాపురం*

** 'దిష్టి' వేధ ఎందువల్ల ఏర్పడుతుంది?*

వీధి, కోణ వేధలకు ఇల్లు గురైనపుడు వేధ ఏర్పడుతుంది. ఇందువల్ల ఆర్థిక, ఆరోగ్య సమస్యలు ఏర్పడతాయి.

*కె.ఉమాపతిపిళ్లై — తడ*

** పుష్యరాగం ధరించాక కూడా ఎటువంటి మంచి జరగలేదు.*

మీరు నీలం(విలోమ) ధరించాలి. అయిదు వ్రేళ్లకు ఉంగరాలు ధరించడం తప్పు. అనవసరమైన ఉంగరాలు సమస్యలు తెస్తాయి.

*జి.వి.ప్రమదారెడ్డి — బెంగుళూరు*

** పాత గృహాలు కొనుగోలు, పునర్నిర్మాణం చేసినపుడు ముఖ్యమైన సూచన చెప్పండి?*

పాత గృహంలో జనన మరణాల వల్ల 'ఆత్మస్థిరత' ప్రభావం ఉండవచ్చు. భవిష్యత్తులో రోగ, భయ, మరణవేధ నివారణకు 'ఈశాన్య కుంభ' ప్రతిష్ట తప్పక చేయించండి.

*షేక్ బషీరున్నీసాబేగం — నెల్లూరు*

** సంపాదన అంతా ఖర్చయిపోతున్నది?*

తూర్పు గృహాలలో ఉత్తర(కుబేర) దోషాలున్నప్పుడు ఖర్చులు విపరీతంగా ఉంటాయి. సంబంధిత రత్నం, యంత్రం ప్రతిష్ట తర్వాత ఫలితాలు చక్కబడతాయి.

*టి.అనూరాధ — గూడూరు*

** వృక్షాన్ని నరికివేసే ఆయనకు 'పెరాలసిస్' వచ్చింది. పరిష్కారం చెప్పండి?*

మీరు పనిచేస్తున్న గ్రామం, పాఠశాలలో ఓ పది మొక్కలు పెంచి పెద్ద చేయండి. పూజా గృహంలో సంబంధిత యంత్రప్రతిష్ట చేయించండి. ఫలితం ఉంటుంది.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*వీరిశెట్టి శకుంతల — నెల్లూరు*

** తూర్పు ఆగ్నేయం, ఈశాన్యములు ఎత్తుగానూ పశ్చిమం పల్లంగా ఉన్నది.*

ఈ స్థలాన్ని 'జ్యోతిర్నిబంధ' వాస్తు శాస్త్రం 'దైత్యపృష్ఠ'మని వ్యవహరిస్తున్నది. ఆర్థిక సమస్యలు పుత్ర, పశు నాశనం ఈ స్థలం వల్ల జరుగుతాయి.

*డాక్టర్ కేదారనాథ్‌రెడ్డి — చెన్నై*

** భారతీయ ఆలయ నిర్మాణము, మానవ శరీర అంగాలకు సారూప్యం ఉందంటారు ఎంత వరకూ నిజం?*

మీరు విన్నది నిజమే. ఒరిస్సా ఆలయ నిర్మాణాల్లో సారూప్యత బాగా కనిపిస్తుంది. పాభాగ(పాదం), జంఘూ(మోకాలు), గండి(మొండెం), మస్తక(తల), బపురి(కపాలం) అక్కడి ఆలయ వాస్తులో వ్యవహరిస్తారు.

*డి.యామినీ నాయుడు — కావలి*

** సెప్టిక్ ట్యాంకు ఏ మూల ఉన్నా మీరు ఒప్పుకోరెందుకు?*

నైరుతి రోగం, మృత్యువు, ఆగ్నేయం స్త్రీవేధ, వాయువ్యం కలహం, ఈశాన్యం సర్వభ్రష్టత అని శాస్త్రాలు చెబుతున్నాయి కాబట్టి!

*సి.మేరీజాన్సన్ — నెల్లూరు*

** 'నీలం' ధరించాక పీడకలలు ఎక్కువగా వస్తున్నాయి.*

మీరు ధరించాల్సింది 'పుష్యరాగం'(శ్రేష్ఠ). రాత్రిళ్లు దక్షిణం లేదా తూర్పు తల ఉంచి నిద్రించండి.

# అమ్మకానికి అంగన్‌వాడీ పోస్టులు!

**ప్రస్తుతం ఉన్న డిమాండ్‌ను బట్టి అంగన్‌వాడీ కార్యకర్త పోస్టుకు 30వేల నుంచి 50వేల వరకు ధర నిర్ణయించిన సిడిపిఓలు ఆ మొత్తం నొక్కేసి, ఎమ్మెల్యేల రెకమెండేషన్ల ఆధారంగా ఎంపిక పూర్తి చేసి, ఉన్నతాధికారులకు నివేదించడం అలవాటుగా చేసుకొన్నారు.**

జిల్లావ్యాప్తంగా అంగన్‌వాడీ కార్యకర్తలు, సహాయకుల నియామకాలకు సంబంధించిన నోటిఫికేషన్ విడుదల చేసిన దగ్గర నుంచి వీటిని దక్కించుకునేందుకు రాజకీయ పైరవీలు ప్రారంభమయ్యాయి. జిల్లాలో సమగ్ర శిశు అభివృద్ధి సేవా పథకం(ఐసిడిఎస్) ప్రాజెక్టులు 17 ఉన్నాయి. వీటి పరిధిలో కొత్తగా అంగన్‌వాడీ కేంద్రాలను ఏర్పాటు చేయాలన్న సంకల్పంతో ఒక్కో ప్రాజెక్టులో 10 అంగన్‌వాడీ కేంద్రాల నుంచి 20 కేంద్రాలను ఏర్పాటు చేయనున్నారు. అంగన్‌వాడీ కార్యకర్తగా దరఖాస్తు చేసుకునేందుకు కనీస విద్యార్హత 10వ తరగతి పాస్‌గా నిర్ణయించారు. ఎస్సీ, ఎస్టీ కాలనీల్లో 10వ తరగతి పాస్ అయిన వారు లేకపోతే 8వ తరగతి చదివిన వారిని ఎంపిక చేయాలన్న ప్రభుత్వ ఆదేశాలున్నాయి. సహాయకులకు 5వ తరగతి విద్యార్హతగా నిర్ణయించి దరఖాస్తులు స్వీకరించడం జరిగింది.

అంగన్‌వాడీ కార్యకర్త, సహాయకుల ఎంపిక కమిటీలో గతంలో స్థానిక ఎమ్మెల్యే సభ్యులుగా ఉండేవారు. వీరు సభ్యులుగా ఉన్నందువల్ల ఇంటర్వ్యూ సమయంలో అధికారులు రాజకీయ ప్రలోభాలకు గురికాబడే వారు. ఎమ్మెల్యేలు సూచించిన వారిని ఎంపిక చేయాల్సిన పరిస్థితి ఉండేది. ఈ విషయం రాష్ట్ర ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్లడంతో ఎంపిక కమిటీలో ఎమ్మెల్యేలను తొలగించింది. ప్రస్తుత ఎంపిక కమిటీలో ప్రాజెక్టు డైరక్టర్, సిడిపిఓ, రెవిన్యూ డివిజనల్ అధికారి, జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి సభ్యులుగా ఉన్నారు. ఎంపిక కమిటీలో ఎమ్మెల్యేలు లేకున్నప్పటికీ వారి సిఫార్సులు బాగా పనిచేస్తున్నాయి. అసెంబ్లీ నియోజకవర్గాల పరిధిలో కొత్తగా చేపట్టబోయే నియామకాలలో ఎమ్మెల్యేల ఆదేశాల ప్రకారం సంబంధిత అధికారులు నడుచుకోవాల్సిన పరిస్థితి ఉంది. ప్రధానంగా అధికార పార్టీకి చెందిన ఎమ్మెల్యేల చేత అనుచరులు సిఫార్సులు చేయించుకుంటున్నారు.

ఒక్కో అంగన్‌వాడీ కార్యకర్త పోస్టుకు 5 నుంచి 10 మంది మహిళలు దరఖాస్తు చేసి ఉన్నారు. 10వ తరగతిలో సాధించిన మార్కుల ఆధారంగానూ, వయసును పరిగణనలోకి తీసుకుని ఎంపిక చేయాల్సి ఉంటుంది. దరఖాస్తు స్వీకరణ గడువు గత నెల 30వ తేదితో ముగిసింది. అప్పటి నుంచి పంచాయితీ, మండల స్థాయి రాజకీయ నాయకుల చుట్టూ తిరుగుతూ ఎలాగైనా పోస్టు వచ్చేవిధంగా సహకరించాలని కోరుతున్నారు. గతంలో అంగన్‌వాడీ కార్యకర్తగా పని చేసేందుకు ఎస్సీ, ఎస్టీలు తప్ప మిగిలిన వారు ముందుకు వచ్చేవారు కాదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంయుక్తంగా నిర్వహిస్తున్న ఈ ప్రాజెక్టులో పని చేస్తున్న కార్యకర్తకు గౌరవ వేతనం చెల్లిస్తారు. 15 సంవత్సరాల క్రితం 275 రూపాయలు గౌరవ వేతనం పొందిన వారు ప్రస్తుతం 3,700 రూపాయలు పొందుతున్నారు. దీంతోపాటు ప్రతినెల టిఏ, డిఏ 300 రూపాయలు, ఉచితంగా సిమ్ కార్డులు అందిస్తున్నారు. గౌరవ వేతనం ఎక్కువగా చెల్లిస్తుండడంతో కార్యకర్త పోస్టుకు మంచి డిమాండ్ పెరిగింది.

ఎస్సీ, ఎస్టీలతోపాటు బిసి, ముస్లిం, మైనార్టీ వర్గాలకు చెందిన వారు సైతం ఈ పోస్టులకు భారీ స్థాయిలోనే దరఖాస్తు చేయడం జరిగింది. వీటికి పెరుగుతున్న డిమాండ్‌ను ఆసరాగా చేసుకున్న కొందరు రాజకీయ దళారులు ఇప్పటికే రంగప్రవేశం చేసి అంగన్‌వాడీ కార్యకర్త పోస్టులు ఇప్పిస్తామంటూ నమ్మబలుకుతున్నారు. స్థానికంగా నివాసంలేని వారి చేత దరఖాస్తు చేయించి ఎమ్మెల్యేల చుట్టూ తిరుగుతూ సిఫార్సు చేయాలని కోరుతున్నారు. ఈ నియామకాలకు సంబంధించి ఇంటర్వ్యూ తేది ఇంకా ఖరారు కాలేదు. ఎంపిక కమిటీలో ఉన్న అధికారులందరూ సమావేశమై ప్రభుత్వ నిబంధనల ప్రకారం ఇంటర్వ్యూ తేది దరఖాస్తు దారులకు తెలియజేయాల్సి ఉంటుంది.

ప్రస్తుత డిమాండ్‌ను బట్టి అంగన్‌వాడీ కార్యకర్త పోస్టుకు 30వేల నుంచి 50వేల వరకు ధర నిర్ణయించినట్లు తెలిసింది. దరఖాస్తులు స్వీకరించిన సిడిపిఓలు సైతం ఎమ్మెల్యేల సిఫార్సు ఉంటేనే కార్యకర్తగా ఎంపిక కాబడుతారని దరఖాస్తు చేసిన వారికి చెబుతున్నారు. దీంతో ఎమ్మెల్యేలను కలిసేందుకు గ్రామాల్లో ఉన్న చోటా నాయకులను ఆశ్రయించక తప్పడం లేదు. ఎంపిక కమిటీలో ఉన్న అధికారులు ప్రభుత్వ నిబంధనల ప్రకారం నడుచుకుంటారో, లేకుంటే రాజకీయ పైరవీలకు ప్రాధాన్యతనిస్తారో వేచి చూద్దాం!

పక్కా ప్లాన్ అమలు

# అక్రమ లేఅవుట్లకు అధికారుల సహకారం!

**నెల్లూరు నగరంలో ఉండే మనుమసిద్ధినగర్, పరమేశ్వరినగర్ ప్రాంతాలు సాంకేతికంగా కొత్తూరు పంచాయితీ పరిధిలోనికి వస్తాయి. ఇక్కడ కొంత సొంత స్థలం, మరికొంత ప్రభుత్వ స్థలం ఆక్రమించి అక్రమ లేఅవుట్లు వెలుస్తున్నా అడిగేవారు లేకుండా పోయారు.**

నెల్లూరు నగర సమీపంలో విచ్చలవిడిగా వేస్తున్న అక్రమ లేఅవుట్లకు రెవెన్యూ పంచాయితీ సిబ్బంది, అధికారులు పూర్తి సహాయ సహకారం అందిస్తున్నారు. లేఅవుట్లు వేస్తున్న వారు ముందుగానే రాజకీయ పార్టీల నేతలను ఆశ్రయించి ఎటువంటి ఇబ్బంది లేకుండా చేసుకుంటున్నారు. లేఅవుట్లు వేసే స్థలం ప్రక్కన ప్రభుత్వ స్థలం వుంటే దానిని కూడా ఆక్రమించి లేఅవుట్లలో కలిపేసుకుంటున్నారు. లేఅవుట్లు ఏర్పాటుచేస్తున్న వారిలో ఏదో ఒక రాజకీయ పార్టీకి చెందిన వారు వుంటున్నారు. ప్లాట్లుగా విభజించిన వెంటనే వీటిని ధనికులతో పాటు పేద, మధ్య తరగతికి చెందిన వారికి విక్రయించి సొమ్ము చేసుకుంటున్నారు నిర్వాహకులు.

నెల్లూరు నగరానికి అతి సమీపంలో వున్న మనుమసిద్ధి నగర్, పరమేశ్వరీనగర్ తదితర ప్రాంతాల్లో అక్రమ లేఅవుట్లు ఏర్పాటై వున్నాయి. పాత మునిసిపల్ కార్పొరేషన్ కార్యాలయానికి కూతవేటు దూరంలో పుత్తా రియల్ ఎస్టేట్‌ను ప్రారంభించారు. 2007–08 సంవత్సరంలో దీనిని ఏర్పాటు చేయడం జరిగింది. ఇందులో 11 ఎకరాలు పట్టా భూమి కాగా వక్ఫ్‌బోర్డుకు చెందిన స్థలం మరో ఎకరాను ఆక్రమించుకుని లేఅవుట్ వేశారు. అప్పట్లో నెల్లూరు నగర ఎమ్మెల్యేగా వున్న ఆనం వివేకానందరెడ్డి అనుచరులుగా వున్నవారు డిటిసిపి అనుమతి లేకుండానే లేఅవుట్ వేశారు. ఇక్కడ దాదాపు 60 శాతం పైగా ప్లాట్లను విక్రయించేశారు. అనంతరం మారిన రాజకీయ పరిణామాల నేపథ్యంలో ఆనంతో విభేదించి బయటకు వచ్చిన అనుచరులకు కష్టాలు మొదలయ్యాయి.

పుత్తా రియల్ ఎస్టేట్ నిర్వాహకులు వక్ఫ్‌బోర్డు స్థలంతోపాటు నీటి పారుదల శాఖకు చెందిన స్థలాన్ని ఆక్రమించారంటూ ఆనం వర్గం రెవెన్యూ, రిజిస్ట్రేషన్ అధికారులకు ఫిర్యాదు చేసి విక్రయాలు నిలిపివేయించారు. దీంతో నిర్వాహకులు కోర్టును ఆశ్రయించాల్సి వచ్చింది. అలాగే మనుమసిద్ధినగర్‌లో ఒక రియల్ ఎస్టేట్ వ్యాపారి వంద ప్లాట్లను 1991లో వేశాడు. ఈ ప్లాట్లకు డిటిసిపి అనుమతి తెచ్చుకొని, రెండవ విడతలో వేసిన 10 ఎకరాలకు డిటిసిపి అనుమతి లేకుండానే ప్లాట్లు ఏర్పాటు చేశారు. లేఅవుట్ వేసే ముందు కొంత రిజర్వుడు స్థలం, 60 అడుగుల రోడ్డు, అడ్డరోడ్డులు చూపించాల్సి వుంది. అయితే పంచాయితీ రెవెన్యూ అధికారులు ముడుపులు స్వీకరించి అక్రమ లేఅవుట్ల జోలికి వెళ్లడం లేదన్న ఆరోపణలు వున్నాయి.

ఈ అక్రమ లేఅవుట్లన్నీ కూడా కొత్తూరు పంచాయితీ పరిధిలోకి వస్తాయి. నగరానికి ఆనుకొని వుండడంతో కార్పొరేషన్ పరిధిలోకి వస్తాయని భావించి అనేక మంది ప్లాట్లను కొనుగోలు చేశారు. అక్రమ లేఅవుట్లు వేస్తున్న విషయాన్ని అక్కడ రాజకీయ పార్టీల నేతలు పసిగట్టి బేరసారాలు కుదుర్చుకుంటున్నారు. ఎవరికి చెందాల్సిన వాటా వారికి చెందుతుండడంతో అక్రమ లేఅవుట్ల ఏర్పాటు గురించి ఫిర్యాదులు అందడం లేదు. చివరకు ప్రజల పక్షాన పోరాడతామని ప్రకటనలు గుప్పించే సిపిఎం పార్టీ కార్యకర్తలు సైతం లేఅవుట్ల నిర్వాహకుల దగ్గర కమీషన్లు తీసుకుంటున్నారు. ఇటీవల ఓ మైనార్టీ సోదరుని దగ్గర డివైఎఫ్ఐకి చెందిన రెహ్మాన్ అనే నాయకుడు దాదాపు 2 లక్షలకు పైగా నగదు వసూలు చేసినట్లు జిల్లా ఎస్పీకి ఫిర్యాదు అందింది. ఈ సంఘటనపై పోలీసు విచారణ జరుపుతున్నారు.

ఇదే ప్రాంతంలో తెలుగుదేశం మాజీ కార్పొరేటర్ నూనె మల్లిఖార్జున యాదవ్ డిటిసిపి అనుమతి లేకుండా 25 ప్లాట్లను ఏర్పాటు చేసి విక్రయాలు జరిపాడు. ఒకరిని చూసి మరొకరు అక్రమ లేఅవుట్లు వేసి పంచాయితీకి రావాల్సిన పన్నులను ఎగవేస్తున్నా అధికారులు మాత్రం మౌనంగానే వుండిపోవడం విశేషం.

# సస్పెన్స్... చారులత!



అల్లూరు రహీం

మన రాష్ట్రంలో వార్తల్లో వెలిగిన అవిభక్త కవలలు వీణ, వాణి. ఇటువంటి అవిభక్త కవలలు ప్రపంచవ్యాప్తంగా ఎంతో మంది ఉన్నారు. కొందరు ఎటువంటి ఇబ్బందులు లేకుండా జీవిస్తున్నారు. అవిభక్త కవలలను విడగొట్టినా హాయిగా బతుకుతున్నారు. ఇటువంటి అవిభక్త కవలలను ఆధారంగా చేసుకొని 'థాయ్' భాషలో ఎలోన్ అనే చిత్రం విడుదలయ్యింది. ఈ చిత్ర కథకు స్థానికతను జోడించి తెలుగు, తమిళ, మళయాళ భాషల్లో ద్వారకేష్ చిత్రపతాకంపై నిర్మించిన చిత్రమే చారులత. అవిభక్త కవలలంటే ఒకే శరీరంతో ఉండే విడదీయలేని కవలలని అందరికీ తెలిసిందే. శరీరం ఒకటైనా వీరి ఆలోచనలు, వ్యవహార సరళి వేరుగా ఉంటుంది. చారులత సినిమాలో దర్శకుడు పొన్ కుమరన్ ఇదే విషయాన్ని చెబుతూ వీరి చుట్టూ ఓ అందమైన ప్రేమకథ అల్లాడు. ప్రేమకథకు తోడు ద్వేష కథనం కూడా కొనసాగుతుంది. మధ్యలో ఆత్మలు ప్రవేశిస్తాయి. సాంకేతిక పరిజ్ఞానాన్ని బాగా ఉపయోగించుకోవడంలో దర్శకుడు కృతకృత్యుడయ్యాడు. ఇదే సినిమాకు బలం చేకూర్చింది. సస్పెన్స్‌తో ప్రేక్షకులను అలరించాడు. ఆత్మ ఊయల ఊగడం, అద్దంలో కనపడడం, స్నానం చేసే టబ్‌లో ప్రత్యక్షమవడం, సముద్రం దగ్గర వెనకాలే అడుగులు వేయడం, దుప్పట్లో దూరి గడబిడ చేయడం రోమాంచితంగా ఉంటుంది. అవిభక్త కవలల నృత్యం, కలసి నడిచే విషయంలో వీలైనంత వరకు ప్రియమణితో క్లోజప్ షాట్స్ తీసిన కెమెరామెన్ పన్నీర్ సెల్వం లాంగ్ షాట్స్‌లో దూపును వాడాడు. కొన్ని సన్నివేశాల్లో ఈయన కెమెరా హాలీవుడ్ స్థాయిలో కనపడుతుంది. చిత్రం చివర ఉన్న ట్విస్ట్‌కు ప్రేక్షకులు గింగిరాలు తిరుగుతారు. మంచి పాటలు, మాటలుంటే చారులత చమత్కారమే వేరుగా ఉండేది. దర్శకుడు పొన్ కుమరన్ కొత్తవాడైనా ప్రతి సన్నివేశాన్ని బాగా చిత్రీకరించాడు. టెంపో చెడిపోకుండా రెండు గంటల్లో చిత్రాన్ని ముగించడం కూడా మంచి ఆలోచనే.




చిత్ర కథలోనికివెళ్తే విశాఖలో అవిభక్త కవలలు చారు-లత(ప్రియమణి ద్విపాత్రాభినయం). వీరి తల్లి(శరణ్య) వీరిని ఎంతో శ్రద్ధగా పెంచి పెద్దవాళ్లను చేస్తుంది. చారు తెలుగమ్మాయిలా ఉంటే లత కాస్త మాడ్రన్ అమ్మాయిలా ఉంటుంది. వయోలిన్ నేర్చుకోను మాస్టర్(మనోహర్) దగ్గరకు వెళ్తే అవిభక్త కవలలకు ఈ విద్య అబ్బదంటాడు. క్లిష్ట ప్రక్రియల వాదన వాళ్లకు సాధ్యం కాదంటాడు. కానీ తదేక దీక్షతో వయోలిన్ వాదనలో చారు-లతలు ప్రావీణ్యం సంపాదిస్తారు. ఈ స్కూల్‌లోనే ఉండే రవి(స్కంద)ను చారు ఆకర్షిస్తుంది. వీరిద్దరి మధ్య ప్రేమబంధాన్ని లత తట్టుకోలేకపోతుంది. నిద్రమాత్రలు మింగి అఘాయిత్యానికి పాల్పడుతుంది. అక్కాచెల్లెళ్లు విడిపోవాలనుకొంటారు. ఆపరేషన్ సమయంలో ఒకరు చనిపోతారు. చనిపోయిన లత ఆత్మగా మారి చారు చుట్టూ తిరుగుతుంటుంది. ఈ విషయం రవి సైతం చూస్తాడు. చనిపోయిందెవరో తెలిసిన తల్లిని 'ఆత్మ' హాస్పిటల్ పాలుచేస్తుంది. ప్రేమికుల పలు వేధింపుల అనంతరం ఆపరేషన్‌లో చనిపోయింది చారు అని తెలియగానే రవి రగిలిపోతాడు. చారుగా తనను ఇన్నాళ్లు మోసగించిన లతపై చేయి చేసుకొంటాడు. తాను కూడా రవిని ఇష్టపడ్డానంటుంది లత. మాంత్రికుడు(రవిశంకర్) ద్వారా బంధింపబడ్డ చారు ఆత్మ చివరి సన్నివేశంలో గందరగోళం చేసినా ప్రేమికుడు రవి తనలో భాగమైన లతను తన తల్లి సలహా మీద పెళ్లి చేసుకోను ఒప్పుకోవడం ఆమె శాంతించడంతో చిత్రం ముగుస్తుంది. చారు – లతగా రెండు పాత్రల్లో ప్రియమణి మంచి నటన ప్రదర్శించింది. రొటీన్ చిత్రాలతో విసిగిపోయిన ప్రేక్షకులు కాస్త ఉత్కంఠతకు లోనుకాను చారులతకు వెళ్లొచ్చు.

## వివేకానందుడిగా వెంకటేష్!



వివేకానందుడి భావనలంటే హీరో వెంకటేష్‌కు చాలా ఇష్టం. వెంకటేష్ ఆలోచనల్లో, ఆచరించే పద్ధతుల్లో కనిపించే మార్పుకు కారణం అదే. సాధారణ జీవితం అంటేనే ఇష్టం. అనవసర విషయాలకు హడావుడి పడిపోవడం నచ్చదు. రామకృష్ణ పరమహంస, వివేకానంద, ఓషో పుస్తకాలు చదువుతుంటా. అవి చదువుతున్నప్పుడు ప్రశాంతంగా ఉంటుందని చెబుతుంటారు. వివేకానందుడిగా కనిపించాలనేది వెంకటేష్ ఆలోచన. ఈ విషయాన్ని ఆయన చాలాసార్లు బయట పెట్టారు. కొంత మంది దర్శకులు కూడా ముందుకొచ్చారు. అయితే కార్యరూపం దాల్చలేదు. ప్రతి సినిమా అనుకోకుండా చేసిందే. ప్రణాళికలు ఎప్పుడూ పెట్టుకోలేదు. కానీ వివేకానందుడి జీవిత కథతో ఓ సినిమా చేయాలనే ఆలోచన మాత్రం మొదలయ్యింది. ఆయన బోధనలు, తత్వం ఈ తరం తెలుసుకోవలసిన అవసరం వుంది. అయితే ఆ సినిమా ఎప్పుడు మొదలవుతుందో తెలీదు. వచ్చే యేడాదైనా పూర్తి చేయాలనుకొంటున్నా అని తన మనసులోని మాట బయట పెట్టారు వెంకటేష్.



## మనసుకు నచ్చితే నటిస్తా!

ప్రేమకావాలి, పూలరంగడు, శ్రీమన్నారాయణ చిత్రాల్లో హీరోయిన్ ఇషా చావ్లా చేసిన సినిమాలన్నీ ప్రేక్షకాదరణ పొందుతున్నప్పుడు లభించే ప్రోత్సాహం అంతా ఇంతా కాదు. అందుకే మరెన్ని వైవిధ్యమైన చిత్రాల్లో నటిస్తానంటుంది ఈ సుందరి. ఇద్దరు కథానాయికలున్న సినిమా అంటే కొందరు ఒప్పుకోరు. మీకు ఆ పట్టింపులుల్లేవా అంటే; ఇద్దరే కాదు ఐదుగురు కథానాయికలున్నా నాకు అభ్యంతరం లేదు. మంచికథ, పాత్ర అని నా మనసుకు అనిపిస్తే చాలు. తప్పకుండా నటిస్తాను. ఒక దర్శకుడు అప్పజెప్పిన పాత్రకు ఏమేరకు న్యాయం చేశామన్నదే ముఖ్యం. ఒక నటికి లభించే గుర్తింపు ఈ విషయంపైనే ఆధారపడి ఉంటుంది.

## నయా భావాల నయన!



జీవితం... పేకాట రెండూ ఒకటే. కావల్సిన ముక్కలు పడవు. పడిన ముక్కలతోనే షో చేయాలంటుంది హీరోయిన్ నయతార. మీ జీవితం ఎన్నో మలుపులు తిరిగిందే అంటే; నిర్లిప్తంగా గడిచిపోతే మజా ఏముంటుంది? తిరగనివ్వండి; కానీ ఆగవల్సిన చోటే ఆగుతుంది. బతుకు బండి చేరవలసిన చోటికే చేరుతుంది. జీవితంలో ఎదుర్కొనే ప్రతి సంఘటనకూ ఓ బలమైన కారణం తప్పకుండా ఉంటుంది. జీవితంలో పొరపాట్లు చేయడం సహజం. అంత మాత్రాన ప్రయాణం ఆగిపోకూడదు కదా? అయితే ఒకటి మాత్రం నిజం. మళ్లీ మేకప్ వేసుకొంటాననుకోలేదు. వేసుకోగానే చిత్ర పరిశ్రమ స్వాగతించిందంది.



## డీ గ్లామర్‌కు సిద్ధం

ప్రతిసారీ అందమైన అమ్మాయిగానే కనిపించడానికి నాకు బోర్ కొడుతుంది. మేకప్ వేసుకోని పాత్రలొస్తే చేద్దామని చాలాసార్లు అనుకొన్నా. కానీ నన్ను డీ గ్లామర్‌గా చూపించడానికి దర్శకులే సిద్ధంగా లేరంటుంది ఇలియానా. పాత్రని బట్టే అలంకరణ. నా అభిరుచులు అందులో మేళవించి చూపించాలని ఎప్పుడూ అనుకోలేదు. వస్త్రధారణ విషయంలో సొంత నిర్ణయాలు తీసుకోలేదు. అమ్మ అప్పుడప్పుడూ సలహాలిస్తుంటుంది. నా దుస్తుల్ని కూడా తానే డిజైన్ చేస్తుంది. సినిమాల్లో దర్శకుడి ఆలోచనలకు అనుగుణంగా నడుచుకొంటా. అతిగా మేకప్ వేసుకోవడం నాకిష్టం ఉండదు. సాధ్యమైనంత సహజంగానే కనిపిస్తా. జులాయిలో పాటల్లో మినహా మిగిలిన సన్నివేశాల్లో సాధారణ అమ్మాయి తానే ముస్తాబయ్యా కదా అనిముక్తాయించింది.

## దేనికైనా రాసిపెట్టాలి!



అయ్యిందేదో అది మన మంచికే. అయ్యేదికూడా మన మంచికే... అవ్వనిది కూడా... అంటూ సానుకూల దృక్పథాన్ని చక్కగా చెబుతుంది. హీరోయిన్ త్రిష. చిత్రసీమలో చేజారిన అవకాశాలు మిమ్మల్లి కలవరపెట్టాయా? అని అడిగితే పై విధంగా స్పందించింది. ఓ అవకాశం నా చేతుల్లోంచి జారి పోవడానికి చాలా కారణాలుంటాయి. అవన్నీ వెతుక్కొంటూ కూర్చుంటే ముందుకు వెళ్లలేం. రాసిపెట్టుంటే వద్దన్నా అది మన వెనుకే పడుతుంది. సినిమా ఫలితాల గూర్చి కూడా నేనెక్కువగా బెంగ పెట్టుకోను. ఒక వేళ నేనునటించిన సినిమా ఫ్లాప్ అయినా ప్రేక్షకులు నేను పడిన కష్టాన్ని గుర్తించక మానరు. సానుకూల దృక్పధం అలవర్చుకోండి. అంతా మన మంచికే అనే భావన పెంపొందించుకోండని సలహాయిస్తుంది.

# ఘనంగా వినాయక చవితి!



బాలాజీనగర్‌లో మలేషియా సుబ్రహ్మణ్యస్వామిని పోలిన వినాయక విగ్రహం వద్ద భక్తజన సందోహం.



వేదాయపాళెంలో కొలువుదీరిన గణపతి.

వినాయక చవితి వేడుకలను ఘనంగా నిర్వహించారు. నగరంలోని వివిధ ప్రాంతాలలో తాత్కాలికంగా ప్రతిష్టించిన వినాయక విగ్రహాలు పలువురిని ఆకట్టుకొన్నాయి. ఒకరికొకరు పోటీలుపడి విగ్రహాలను ఏర్పాటు చేయడంతో విగ్రహాల సైజుల్లో భారీతనం కన్పించడంతోపాటు రూపురేఖల్లోనూ మార్పులు చోటుచేసుకొన్నాయి. గత కొన్ని సంవత్సరాలుగా వినాయకచవితికి ఏర్పాటుచేస్తున్న విగ్రహాల్లో సాధారణ గణనాధుని స్థానంలో కొంగొత్త రూపురేఖలు ఆవిష్కృతం అవుతున్నాయి. విగ్రహాలను తయారుచేసే కళాకారులు తమ ఇష్టానుసారంగా విగ్రహాలను రూపొందిస్తూ ఉండడంతో విభిన్న ఆకృతుల్లో గణనాధుడు కొలువు తీరుతున్నాడు. ఇక నగరాల్లో వివిధ కూడళ్లలో ఏర్పాటుచేసిన వినాయక విగ్రహాలను పరిశీలిస్తే ఎంత ఆకర్షణీయంగా, అట్టహాసంగా ఉంటున్నాయో కన్పిస్తుంది. అయ్యప్పగుడి, వేదాయపాళెం, చంద్రమౌళినగర్, జ్యోతినగర్, భక్తవత్సలనగర్, నిప్పో సెంటర్, కరెంట్ ఆఫీస్, శబరి శ్రీరామక్షేత్రం, రామ్‌నగర్ ప్రాంతాల్లో భారీ వినాయక విగ్రహాలను ఏర్పాటు చేశారు. అలాగే పొగతోట, శివప్రియ సెంటర్, మండపాలవీధి, పెద్దపోస్టాఫీసు, చిన్నబజార్, స్టోన్‌హౌస్‌పేట, బాలాజీనగర్, ఎసి నగర్, జడ్పీ సెంటర్‌లలోనూ విభిన్న రూపాలలో గణనాధులు కొలువు తీరారు. వీటిలో పప్పులవీధిలో ప్రకాశ్‌నగర్‌లో చెర్రీ పండ్లతో రూపొందించిన వినాయకుడు, స్టోన్‌హౌస్‌పేటలో గవ్వలతో తయారుచేసిన గణపతి విగ్రహం, సిఎంఆర్ వద్ద నవధాన్యాలతో చేసిన విఘ్నేశ్వరుడు, చిన్నబజార్‌లో కాయగూరలతో చేసిన గణపతి బొమ్మలు విశేషంగా ఆకట్టుకొన్నాయి. అలాగే బాలాజీనగర్‌లో మలేషియాలోని సుబ్రహ్మణ్య స్వామి విగ్రహం తరహాలో 26 అడుగులతో ఏర్పాటుచేసిన వినాయక విగ్రహం ప్రత్యేక ఆకర్షణీయంగా నిలచింది.

# విషజ్వరాల సింహపురి!

## హాస్పిటళ్ల కిటకిట



జ్వరపీడితులతో కిటకిటలాడుతున్న నెల్లూరు హాస్పిటళ్లు.

నెల్లూరు నగరం జ్వరాల బారిన పడుతోంది. పడకేసిన పారిశుద్ధ్యం, దోమల విజృంభణతో నగర వాసులు విషజ్వరాలకు గురై ఆస్పత్రుల పాలవుతున్నారు. వైరల్ జ్వరాలతోపాటు డెంగ్యూలాంటి ప్రాణాంతక జ్వరాల బారిన పడుతున్నారు. దోమల కారణంగా వచ్చే జ్వరాలే అధికం కావడంతో రోజురోజుకు విషజ్వరాలతో ఆస్పత్రులకు వచ్చే వారి సంఖ్య పెరుగుతోంది. నగరంలోని పలు ప్రైవేట్ ఆస్పత్రులు జ్వరపీడితులతో కిటకిటలాడుతున్నాయంటే ఎంతగా ఇవి ప్రబలుతున్నాయో తెలుస్తుంది. వైరల్ ఫీవర్, మలేరియా, టైఫాయిడ్‌తోపాటు డెంగ్యూ, స్క్రబ్ జ్వరాలు ప్రజలను అతలాకుతలం చేస్తున్నాయి. పిల్లలు, పెద్దలు అనే తేడా లేకుండా వందల సంఖ్యలో జ్వరాల బారిన పడుతున్నారు. నగరంలోని రామచంద్రారెడ్డి హాస్పిటల్, జయభారత్ హాస్పిటల్‌తోపాటు పలు ప్రైవేట్ ఆస్పత్రుల్లో జ్వరాల బారినపడిన రోగులు చికిత్స పొందుతున్నారు. ఇటీవల ఇందుకూరుపేట మండలం జగదేవిపేటకు చెందిన మోహన్ తీవ్రమైన జ్వరంతో బాధపడుతూ రేబాల వారి ఆస్పత్రిలో చేరగా పిల్లవాడికి డెంగ్యూ జ్వరం వచ్చినట్లుగా గుర్తించినప్పటికీ ఇంకా నిర్ధారించ లేదు. మరోవైపు రామచంద్రారెడ్డి ప్రజావైద్యశాలకు రోజుకు 90 నుంచి 100కు పైగా జ్వరంతో బాధపడేవారు వస్తుండగా వీరిలో 30 శాతం డెంగ్యూ కేసులే ఉంటున్నాయని అక్కడి వైద్యులు నిర్ధారిస్తున్నారు. డెంగ్యూ జ్వర్వం వచ్చిన వారికి రక్తంలో ప్లేట్‌లెట్స్ పడిపోతాయి. తక్షణం వీటిని రోగులకు ఎక్కించాల్సి ఉంటుంది. అయితే ప్లేట్‌లెట్ల కొరత డెంగ్యూ పీడితుల ప్రాణాల మీదకు వస్తోంది. ప్లేట్‌లెట్లను రక్తం నుంచి వేరుచేయాల్సి వుంటుంది. దీనికి ఎక్కువ యూనిట్ల రక్తం అవసరం. ప్రభుత్వ పెద్దాసుపత్రిలోని బ్లడ్ బ్యాంక్, రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్‌లలో అవసరానికి తగినంత ప్లేట్‌లెట్లు అందుబాటులో లేకపోవడంతో డెంగ్యూ బారిన పడినవారు వీటికోసం అధికంగా ఖర్చు చేయాల్సి వస్తోంది. ఒక్కో పేషెంట్ వ్యాధి నయం చేసుకునేందుకు 50 వేల రూపాయల వరకు ఖర్చు చేయాల్సి రావడంతో సామాన్య, మధ్యతరగతి ప్రజలు అంత మొత్తాలు పెట్టి వైద్యం చేయించుకోవడం తలకు మించిన భారం అవుతోంది. విషజ్వరాల తీవ్రత అధికంగా ఉంటున్నా, వైద్య ఆరోగ్య శాఖాధికారులు మాత్రం అసలు డెంగ్యూ కేసులే నమోదు కాలేదని సెలవిస్తున్నారు.

# ఆర్టీసి బస్టాండ్‌లో వ్యాపారుల దోపిడీ




ఆర్టీసి బస్టాండ్‌లో ఇష్టమొచ్చిన రేట్లకు అమ్ముతున్న అంగళ్లు.

అక్కడ వ్యాపారులు చెప్పిందే ధర, వారు పెట్టిందే రేటు, ఎంత చెప్తే అంతకు కొనాల్సిందే. ఇదేంటని ప్రశ్నిస్తే దబాయింపులు, ఇదంతా నగరంలోని కూరగాయల మార్కెట్‌లోని పరిస్థితులు అనుకొంటే తప్పులో కాలేసినట్లే. ఈ ధరల దోపిడీ జరుగుతున్నది సాక్షాత్తు ఆర్టీసి బస్టాండ్‌లో కావడం విశేషం. ఇక్కడ వ్యాపారాలు నిర్వహిస్తున్న వారు ఆదాయమే ధ్యేయంగా పెట్టుకొని ప్రయాణీకులను నిలువునా దోచుకొంటున్నారు. ప్రతి వస్తువును ఎమ్మార్పీ ధరలకే అమ్మాల్సి ఉన్నా ఎక్కడా అది అమలు కావడం లేదు. తమ ఇష్ట ప్రకారం వస్తువుల ధరలు నిర్ణయించి అధిక ధరలకు అమ్ముతున్నా అడిగేవారే లేకుండా పోయారు. ఆర్టీసి బస్టాండ్‌లో వివిధ వస్తువులు, ఆహార పదార్థాలను అందించే షాపులు 54 వరకు ఉన్నాయి. వీటికి ఐదేళ్లకొకసారి టెండర్లు నిర్వహిస్తుంటారు. వీటిని పాడుకొన్న వారికి ఆయా షాపులను కేటాయిస్తుంటారు. నెల నెలా అద్దెల రూపంలో ఆర్టీసికి 10.65 లక్షలు ఆదాయం లభిస్తుంది. షాపులను సొంతం చేసుకొన్న వ్యాపారులు ఇక అప్పటి నుంచి తమకు తోచిన ధరలకు వస్తువులను అమ్ముతుంటారు. జిల్లావ్యాప్తంగా వివిధ ప్రాంతాల నుంచి ఇక్కడకొచ్చే ప్రయాణీకులు బస్టాండ్‌లోని షాపుల్లో వస్తువులు కొంటే వీటి ధర విని కళ్లు తిరిగినంత పనవుతోంది. ఇదేమని ప్రశ్నిస్తే షాపు నిర్వాహకులు ప్రయాణీకులపై పడి కొట్టినంత పని చేస్తుండడంతో ఈ గొడవలు పెట్టుకోలేక, వారి ఛీత్కారాలు తట్టుకోలేక అడిగినంత ఇచ్చి వెళ్తున్నారు. షాపుల ముందు ధరల పట్టిక చూస్తే మాత్రం ఎమ్మార్పీ ధరలు వ్రాసి ఉంటారు. కానీ అవెక్కడా అమలు కావు. ప్రతి వస్తువు మీద ఐదారు రూపాయలు ఎక్కువచేసి అమ్ముతూ ప్రయాణీకులను దోచుకొంటున్నా పట్టించుకునే అధికారిగానీ, ప్రశ్నించే సిబ్బందిగానీ లేకపోవడంతో షాపులవారు ఆడింది ఆటగా మారింది. ఆర్టీసి అధికారులు దీనిపై ప్రశ్నిస్తే ఇప్పటివరకు ఎవరూ మాకు ఫిర్యాదు చేయలేదని, ఎవరైనా చెప్తే అలాంటి వారిపై చర్యలు చేపడుతామని చెప్పి చేతులు దులుపుకొంటున్నారు. అధికారులు మిద్దెదిగి వచ్చి చూస్తే అన్నీ విషయాలు తెలుస్తాయి.

# కార్పొరేషన్‌లో విజిలెన్స్ అధికారులు

## నియామకానికి ప్రభుత్వం గ్రీన్‌సిగ్నల్

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్‌కు త్వరలో విజిలెన్స్ అధికారుల నియామకం జరుగనుంది. ఈ మేరకు రాష్ట్ర ప్రభుత్వం విజిలెన్స్ అధికారుల నియామకానికి సంబంధించిన ఉత్తర్వులు కూడా ఇటీవల జారీ చేసింది. కార్పొరేషన్ పరిధిలో జరిగే పనులు, నిర్మాణాలపై విజిలెన్స్ విభాగం అధికారులు పరిశీలించి నాణ్యతా ప్రమాణాలను గుర్తిస్తారు. ఇప్పటివరకు ఇంజనీరింగ్ విభాగం అధికారులే నిర్మాణాలను పర్యవేక్షించేవారు. ఇంజినీర్లు, వర్కు ఇన్‌స్పెక్టర్లు కాంట్రాక్టర్లతో కుమ్మక్కై నాసిరకంగా సిమెంటు రోడ్లు, ఇతర భవన నిర్మాణాలను చేపడుతున్నారు. దీంతో కొద్ది నెలలకే ఈ నిర్మాణాలు శిథిలావస్థకు చేరుకొంటున్నాయి. వీటిని నియంత్రించేందుకు రాష్ట్రవ్యాప్తంగా అన్ని మునిసిపల్ కార్పొరేషన్లలో విజిలెన్స్ అధికారుల నియామకం జరుపనుంది ప్రభుత్వం. ఈ అధికారుల నియామకం జరిగితే కార్పొరేషన్‌లో కొంతమేర అవినీతి అక్రమాలను అరికట్టవచ్చు. అనుమతి లేకుండా నిర్మించే భవనాల గురించి విజిలెన్స్ అధికారులు ముందుగానే పసిగట్టి ఆపుదల చేయించవచ్చు.



నెల్లూరు చంద్రమౌళినగర్‌లో జరిగిన వినాయకచవితి వేడుకల్లో పాల్గొన్న ప్రముఖ పారిశ్రామికవేత్త వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి. ప్రక్కన వెందోటి సాయిభాస్కర్‌రెడ్డి, ఉత్సవ నిర్వాహక కమిటీ సభ్యులు ఉన్నారు.

## అగ్నిపర్వతం బ్రద్దలౌతుందా?

మొదటి పేజీ కొరవ

దురదృష్టవశాత్తు మన ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డికి అంతటి రాజకీయ నైపుణ్యం లేదు. ఈ పరిస్థితి వస్తుందని నెలరోజుల ముందు నుంచే అర్థమౌతున్నా, దాన్ని నివారించడానికి చిన్నపాటి ప్రయత్నం చేయలేదాయన. కవాతుకు పోలీసు అనుమతి నిరాకరించడం తప్ప, మరొక ప్రత్యామ్నాయం చూడలేదు. ఇంతదూరం వచ్చిన ఉద్యమకారులు పోలీసు అనుమతి లేదని కవాతు విరమించుకొంటారని భావించడం భ్రమ. పోలీసు ఎత్తుగడలను ముందుగానే వూహించి, ఉద్యమకారులు చాలా తెలివిగా వ్యవహరిస్తున్నారు. జిల్లాల నుంచి పెద్ద సంఖ్యలో యువతీ యువకులను సమీకరిస్తున్నారు. రెండు లేదా మూడు రోజుల పాటు ట్యాంక్‌బండ్ దగ్గరే మకాం పెట్టడానికి తగిన ఏర్పాట్లు చేస్తున్నారు.

జనసమీకరణ జరగకుండా చూడగల్గితే, వూళ్ల నుంచి ఉద్యమకారులు బయలుదేరక ముందే ఆప గల్గితే, పరిస్థితి పోలీసు అదుపులో వుంటుంది. కానీ వినాయక నిమజ్జనం సాకుతో హైదరాబాదుకు భారీ సంఖ్యలో ఉద్యమకారులు చేరిపోతే, ట్యాంక్ బండ్ దగ్గర గుమికూడితే చెదరగొట్టడం జరిగే పని కాదు. అంతర్జాతీయ మీడియా కళ్ల ముందు ఒక్క తుపాకీ తూటా పేల్చినా ప్రపంచం దృష్టిలో భారతదేశం పరువు పోతుంది. చెడ్డ పేరు వస్తుంది. అట్లని వదిలేస్తే మంది మూగిన చోట ఏమైనా జరగవచ్చు. ప్రభుత్వాన్ని, పోలీసును చాలా పెద్ద ఇరకాటంలో పెట్టాడు కోదండరాం. దాదాపు పదిహేనేళ్లుగా కెసిఆర్ తెలంగాణ ఉద్యమాన్ని నడుపుతున్నా చిన్నపాటి హింసకు కూడా తావు లేకుండా జాగ్రత్త పడ్డాడు. పరిస్థితి తన చెయ్యిదాటి పోతుందనుకొన్న సందర్భంలో ఉద్యమాన్ని వెనక్కు లాగాడే తప్ప, హింసకు అవకాశం ఇవ్వలేదు. కానీ ఇప్పుడు ఆయన చేతులలో ఏమీ లేదు. ప్రభుత్వం కోదండరాంకు నచ్చచెప్పో, భయపెట్టో కవాతును వాయిదా వేయిస్తే తప్ప 30తేది కవాతు తెలంగాణ ఉద్యమంలో ఒక కీలక ఘట్టంగా పరిణామం చెందడం ఖాయం. ఉద్యమ అగ్నిపర్వతం బ్రద్దలు కావడం తథ్యం. దాని పరిణామాలు ఎంత తీవ్రంగా వుంటాయో వూహించడం కష్టం.

## వాల్‌మార్ట్‌పై నిరసన

16వ పేజీ కొరవ

లేని రొయ్యలు ఆధిక్యం ప్రదర్శిస్తాయనే పురాతన చైనా సూక్తి దీనికి సరిపోతుంది. వస్తువుల కొనుగోలులో మన అలవాటు పాశ్చాత్య దేశాలకు భిన్నంగా వుంటాయి. ఇంటి పక్కనుండే అంగడి యజమానితో దగ్గరి సంబంధాలుంటాయి. మధ్య తరగతి కుటుంబీకులు రోజు వారీ అప్పు తీసుకొని, నెలకొకసారి చెల్లింపు చేస్తుంటారు. తెలిసిన అంగడికే వెళ్లడం మనకలవాటు. ఒక్కసారిగా ప్రజల చేత ఇటువంటి అలవాట్లను మాన్పించి, అందరినీ తమ సూపర్ మార్కెట్లకు ఆకర్షించడం వాల్‌మార్ట్ వల్ల అయ్యే పని కాదు. అందువల్ల పెద్ద పెద్ద నగరాలలో తప్ప చిన్న చిన్న పట్టణాలలో వాల్‌మార్ట్ వల్ల చిల్లర అంగడి యజమానులకు ప్రస్తుతానికి వచ్చిన భయం ఏదీ వుండకపోవచ్చు.



నెల్లూరు లయన్స్ క్లబ్ తరపున జమీన్‌రైతు సంపాదకుడు డోలేంద్రప్రసాద్‌ను సన్మానిస్తున్న అధ్యక్షుడు కె.లక్ష్మీనారాయణ. చిత్రంలో లయన్ ఎస్వీ రమణయ్య, మోహన్‌రాజు, ఆంజనేయులు వున్నారు.

ఐల్యాండ్‌లు కావడంతో వాటిపై ఏమి మాట్లాడితే ఏమి ప్రమాదమోనని భయపడి ఒక్కమాట కూడా మాట్లాడకుండా ఉండిపోయాడు.

## ఇరుకు రోడ్ల వల్లే ట్రాఫిక్ ఇబ్బందులు!

నగరంలో ఇరుకు రోడ్లు, పార్కింగ్ ప్రదేశాలు లేకపోవడం వల్లనే ట్రాఫిక్ ఇబ్బందులు తలెత్తుతున్నాయని ఎస్పీ రమణకుమార్ తెలిపారు. ఈ సమస్యను అధిగమించేందుకు ప్రయత్నిస్తున్నామన్నారు. మునిసిపల్ అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని, వారి వైపు నుంచి ఎలాంటి సహకారం అందడంలేదన్నారు. పార్కింగ్ ప్రదేశాలు చూపడం లేదన్నారు. రోడ్లు వెడల్పు చేస్తున్నా ప్రయోజనం లేకుండా పోతున్నదన్నారు.

## మతం కాదు ప్రవర్తన మార్చుకోవాలి

మనిషి మతాన్ని మార్చుకోవడం వలన ప్రయోజనం లేదని వ్యక్తిత్వాన్ని మార్చుకోవాలని నెల్లూరీయుడు, కాకినాడ పీఠాధిపతి పరిపూర్ణానంద స్వామి ప్రవచించారు. నగరానికి వచ్చిన ఆయన పలు కార్యక్రమాలలో పాల్గొని మాట్లాడారు. టౌన్‌హాలులో జరిగిన కార్యక్రమంలో పాల్గొన్న ఆయన మాట్లాడుతూ వ్యక్తి నడవడిక, ప్రవర్తనలో మార్పు రావాలన్నారు. హిందూత్వం ఒక మతం కాదని, అది ధర్మం అన్నారు. మతమార్పిడులకు పాల్పడడాన్ని ఆయన ఖండించారు. దీనిపై ప్రభుత్వం చట్టం చేయాలన్నారు. తిరుమలలో వకుళా మాత ఆలయం వద్ద త్రవ్వకాలు నిలిపివేసి అక్కడే ఆలయాన్ని నిర్మించాలన్నారు. సెల్‌ఫోన్‌లు, టీవీ సీరియళ్లు మానవ సంబంధాలను దెబ్బతీస్తున్నాయన్నారు.

## చివరికి అందరూ అక్కడికే!

ఎస్పీ రమణకుమార్ ఆధ్వర్యంలో నడుపుతున్న చైల్డ్ అండ్ పోలీస్(క్యాప్) సంస్థను హైకోర్టు జడ్జి సీతాపతి ఇటీవల సందర్శించారు. బోడిగాడి తోటలో నివసిస్తున్న పిల్లలు ఇక్కడ ఉన్నారని తెలుసుకొని బోడిగాడితోటలో ఉన్నామని నిరాశ చెందనవసరం లేదని అందరూ చివరికి అక్కడికే చేరుకోవాలన్న సంగతిని మరువరాదంటూ వేదాంతం మాట్లాడారు. అనంతరం విద్యార్థులతో గడిపి పోలీస్ అధికారులను అభినందించారు.

## నటి అశ్వని కన్నుమూత

నెల్లూరీయురాలు అరణ్యకాండ, వివాహ భోజనంబు, చూపులు కలిసిన శుభవేళ, నీకు నాకు పెళ్లంట చిత్రాల్లో హీరోయిన్ అశ్వని(43) కాలేయ వ్యాధితో బాధపడుతూ 23వ తేది చెన్నైలో మరణించింది. అదే రోజు నెల్లూరులో ఆమె అంత్యక్రియలు జరిగాయి. అశ్విని తెలుగు, తమిళ, కన్నడ భాషల్లో 110 చిత్రాల్లో నటించింది. ఆమె బృందావనం ప్రాంతవాసి, బద్దెపూడి నరసింహయ్య కుమార్తె. ఆమెకు భర్త, కుమారుడున్నారు.

## ఆదాల కళాపీఠం

మొదటి పేజీ కొరవ

సత్యం ప్రదానం చేసిందంటే ఆమె కళా ప్రావీణ్యత ఎంతో అర్థం చేసుకోవచ్చు. ప్రపంచంలో ఆమె ప్రదర్శన ఇవ్వని దేశం లేదు. శ్రీలంక ప్రభుత్వం ఆమె చేత తమ పార్లమెంట్‌లో నృత్య ప్రదర్శన ఇప్పించుకొని, అరుదైన గౌరవం కట్టబెట్టింది. అంత ఖ్యాతి కల్గిన కళాకారిణిని నెల్లూరు రప్పిస్తున్నాడు ఆంజనేయరెడ్డి గారు.

మూడవ రోజు భరత నాట్యంలో ప్రముఖురాలైన డాక్టర్ ఆనంద్ శంకర్ జయంత్ ప్రదర్శన వుంటుంది. కళాకారుల బృందంతో కలిసి ఆమె నిర్వహించే బాలే నృత్యాలకు ప్రపంచ ఖ్యాతి వుంది. ఇదే రోజు, ఆదాల కళాపీఠం తరపున డాక్టర్ వేదాంతం సత్యనారాయణ శర్మ గారికి విశిష్ట కళా పురస్కారం అందజేస్తారు. స్త్రీ పాత్రధారణలో కూచిపూడి నృత్యానికి విశ్వకీర్తి సంతరించి పెట్టిన లబ్ద ప్రతిష్ఠుడు వేదాంతం శర్మగారు. అటువంటి కళాకారుడిని సన్మానించుకోవడం నెల్లూరుకు దక్కిన గౌరవం అని చెప్పవచ్చు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### కలెక్టరేట్ వద్ద సర్ప విన్యాసం!

నెల్లూరు కలెక్టరేట్ ముంగిట 21వ తేది ఆరడుగుల నాగుపాము ఓ అంగట్లో దూర ప్రయత్నించగా ముందు వెనుకా ఆలోచించి ఆ తర్వాత దాన్ని స్థానికులు చంపేశారు. కలెక్టరేట్ చుట్టు ప్రక్కల బాగా మరుగుంది. ఉత్తరం వైపు ముస్లింల స్మశానముంది. ఈ పాము అక్కడి నుంచే వచ్చి ఉండవచ్చు.

### పెంచలకోనలో మంచి భోజనం!

జిల్లాలో ప్రసిద్ధ నృసింహ క్షేత్రం పెంచలకోనలో నిత్యాన్నదాన కార్యక్రమంలో భాగంగా భక్తులకు మంచి భోజనం పెడుతున్నారు. తిరుమల కొండపై పెడుతున్న భోజనం కన్నా ఈ భోజనం నాణ్యత బాగుంది. పచ్చడి, నెయ్యి, తాళింపు, పప్పు, సాంబారు, రసం, మజ్జిగ, పాయసంతో పెడుతున్న ఈ భోజనం నృసింహ ప్రసాదంగా అభివర్ణించాల్సిందే. ఆలయ పాలకవర్గం పదవీ కాలం ముగిసినా అధికారవర్గం ఎటువంటి కక్కుర్తికి పాల్పడకుండా ఈ కార్యక్రమం బాగా నిర్వహించడం అభినందనీయం.

### మునిసిపల్ కమిషనర్ మౌనవ్రతం

మునిసిపల్ కమిషనర్ ఆంజనేయులు మౌన వ్రతం పాటించడం చర్చనీయాంశమయ్యింది. ఇటీవల ఎస్పీ బి.వి.రమణకుమార్ ఆధ్వర్యంలో ట్రాఫిక్ అడ్వయిజరీ కమిటీ సమావేశం జరిగింది. అందులో నగరంలోని ట్రాఫిక్ ఐల్యాండ్‌ల వలన ట్రాఫిక్‌కు ఇబ్బంది కలుగుతున్నందున వాటి విస్తీర్ణం తగ్గించాలని నిర్ణయించింది. వివిధ శాఖల అధికారులు దీనిపై మాట్లాడుతున్నా కమిషనర్ మాత్రం ఈ విషయమై మౌనంగా ఉండిపోయారు. రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఇష్టపడి కట్టించుకున్న

## జనవాణి

2వ పేజీ కొరవ

దానికి తప్ప ఈ కార్డు పుట్టిన తేదీ లేకపోవడం వల్ల దేనికి పనికి రాకపోవచ్చు.

పి.రుక్మిణి నెల్లూరు

### ఇక ఆపండి!

ఆగష్టు 31తేది బంద్ జరిగింది. సెప్టెంబర్ 4, 20తేదీలలో మరో రెండు బందులు జరిగి ప్రజలకు, వ్యాపారస్తులకు, విద్యార్థులకు తీవ్ర నష్టం కలిగించాయి. ఈ బందులు చట్ట విరుద్ధమని కోర్టులు చెప్పినా పెడచెవిన పెడుతున్నారు. తెలంగాణ బందులు ముందు ముందు రానున్నాయని సంకేతాలు వస్తున్నాయి. ఏ కారణం వల్లనయితేనేమి బందులను దృష్టిలో పెట్టుకొని తల్లిదండ్రులు తమ పిల్లల ఇంజనీరింగ్ చదువులకు యితర రాష్ట్రాలను ఆశ్రయిస్తున్నారు. మన కాలేజీలు నిండక మూతపడే పరిస్థితి దాపురించింది. ప్రభుత్వం బందులను అరికట్టేందుకు కఠిన చర్యలు తీసుకోవాలి.

డి.సుధాకర్‌రెడ్డి కావలి

### ప్రజా రివార్డు పంటల జమీన్‌రైతు

నెల్లూరు మట్టిలో పుట్టి పెరిగిన మాణిక్యం జమీన్‌రైతు పత్రిక. 8దశాబ్దాలకుపైగా అవిశ్రాంతంగా, అవిచ్ఛిన్నంగా రైతుల, ప్రజల సమస్యలపై పోరుబాటలో నడుస్తున్న ఈ పత్రిక జనజీవన స్రవంతిలో అంతర్భాగమై వారి గుండెలలో గూడు కట్టుకొన్నది. పాత, క్రొత్తల మేలిమి కలపోతలతో తనదైన శైలి విన్యాసంతో పత్రిక సంపాదకత్వాన్ని నిర్వహిస్తున్న మిత్రుడు డోలేంద్రప్రసాద్‌కు రాష్ట్ర స్థాయిలో ఉత్తమ జర్నలిస్టు అవార్డు సత్కారం లభించడం అభినందనీయం.

ఎం.రామ్మూర్తి విశాఖపట్నం

## పదరంగం -35

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | 4 | | 5 | 6 | 7 |
| | | | | 8 | 9 | | | 10 | | |
| 11 | | | | | 12 | | 13 | | | |
| | | | 14 | 15 | | | 16 | | | |
| 17 | 18 | | | 19 | | 20 | | | 21 | |
| | | | 22 | | | | | 23 | | 24 |
| 25 | | | 26 | | 27 | | 28 | | | |
| | | 27 | | | | | | | | |
| | | | | 30 | | | | 31 | 32 | |
| 33 | | | | | 34 | | | | | |
| | | | | | 35 | | | | 26 | |

**అడ్డం**

1. శుభాన్ని ఇచ్చునది (5)
4. సొగసు కలదే, తడబడింది (5)
8. కొయ్యను తినే పురుగులు (3)
10. బలపానికి జోడు (3)
11. "సూర్యుడు"కి వికృతి (3)
12. తడబడిన కపోతము (4)
14. ఎదుటివానికి సులభంగా ఇవ్వగలిగినది (3)
16. పాపం చేసినవాడు వెనుక నుంచి వస్తున్నాడు (2)
17. తత్తరపాటు ఆస్ట్రేలియా జంతువు (3)
19. సంతుష్టి లేకపోవడం (4)
23. బాధలు, కష్టాలు (3)
25. క్రొత్త పెళ్లికూతురు తెచ్చే సంభారాలు (2)
26. రెండు 'మ'ల మధ్య పాదం వెనుక భాగం (3)
28. జొన్న విత్తుల గుత్తి (4)
29. అజ్ఞానానికి వ్యతిరేకం (2)
30. కాకర కాయ రుచి (2)
31. తడబడిన విషం (3)
33. రాముని సేన (4)
34. తాయెత్తుకు మరోమాట తడబడింది (3)
35. బ్రిడ్జి అటు నుంచే నిర్మించారు (3)
36. చెడ్డకు వ్యతిరేకం (2)

**నిలువు**

1. శుభాన్ని సూచించేది (5)
2. సేవకుడు, భక్తుడు (3)
3. చేలకు, స్థలాలకు కాపలా (2)
4. ఈజీ, కష్టం కాదు (3)
5. క్రింద నుంచి సర్పద్వేషం (4)
6. స్వప్నం (2)
7. నృత్యం చేసే ఆమె క్రింద నుంచే వస్తున్నది (4)
9. చిరునవ్వు (4)
13. కోపిష్టి కాదు, పాపి (3)
15. కెరటం (2)
18. తడబడిన వడలు (3)
20. త్రాసు, ఒక రాశి (2)
21. క్రింద నుంచే చిల్లులు, బొరియలు వున్నాయి (3)
22. వాంతి, డోకు చేసుకోవడం (3)
24. కింపురుషులతో వుండే అప్సరసలు చివరలో తడబడ్డారు (4)
25. మహారాజుకి కప్పం చెల్లించే చిన్న రాజు (5)
27. ఆ వీధిలో మసీదు వుంది, అందుకే ఆ పేరు (5)
29. లేటుగా వచ్చే దంతం (4)
32. క్రింద నుంచి శుభం (3)

**సమాధానాలు**

## పదరంగం -34

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 పం | చ | 2 మ | వే | 3 దం | | 4 ట | ము | 5 కు | | 6 ప్ర |
| చా | | ది | | డి | | | | 7 యు | వ | తి |
| 8 క్ష | మ | | 9 పా | | 10 ప | 11 రా | శ | క్తి | | మ |
| రి | | 12 కూ | త | | 13 త్రం | యం | | | 14 వా | |
| 15 మం | 16 గ | లి | | | | 17 చ | ల | 18 న | చి | త్రం |
| 19 త్రం | పా | | | | 20 సు | | | 21 ర | కం | |
| | | 22 కం | | 23 లు | పా | తా | | కు | | 24 ఆ |
| 25 వై | కుం | ఠం | | 26 గు | రి | | 27 మ | డు | 28 గు | లు |
| శా | | | 29 కీ | లు | | | రు | | 30 డి | మ |
| ఖ | | 31 గు | డు | అ | | 32 తె | లు | 33 గు | గం | గ |
| 34 ము | రా | రి | | | 35 చె | ర | | 36 పే | ట | లు |

# సంక్షిప్త సింహపురి

## తెలుగుతల్లికి షడ్విధ నీరాజనాలు!

తెలుగుతనానికి పెద్దపీట వేస్తూ తెలుగుతల్లికి షడ్విధ నీరాజనాలు కార్యక్రమానికి విశ్రాంత తెలుగు పండితుడు ఆలూరి శిరోమణిశర్మ శ్రీకారం చుట్టారు. ఈ కార్యక్రమం సెప్టెంబర్ 30వతేది దర్గామిట్టలోని అచ్యుత సుబ్రహ్మణ్యం కళ్యాణ మండపంలో జరుగుతుంది. కార్యక్రమంలో జ్యోతి ప్రజ్వలన, నాదస్వర, వేదస్వర, సంగీత, మంజీర, సాహిత్య నీరాజనాలు జరుగుతాయి. దీనికి వచ్చే వారంతా పురుషులైతే ధోవతి, అడ్డపంచె, లాల్చీ; మహిళలు, యువతులు చీర, పావడా, పైట, చోళితో రావాలని నిర్దేశం. పోటీల్లో విజేతలకు బహుమతులుంటాయి. ఇతర వివరాలకు చరవాణి (ఫోన్) 98856 61727, 98851 01451 నెంబర్లకు సంప్రదించవచ్చు.

## షూటింగ్ సందడి



ఆదిత్య అకాడమీ, ఆర్.ఆర్. మార్కెటింగ్ సంయుక్తంగా సమర్పించే ఇజ్రాయెల్ దేవుని ఆజ్ఞ చిత్రం షూటింగ్ రెండవ షెడ్యూల్ నగరంలోని రైల్వే స్టేషన్ రోడ్డు, వెంకటాచలం మండలంలోని బురాన్‌పూర్ పరిసర ప్రాంతాలలో జరిగింది. ఈ చిత్రం పూర్తిగా యెహోవా మహిమలు, ఆయన గొప్పతనాన్ని తెలిపే విధంగా ఉంటుందని దర్శకుడు కె.మురళీమోహన్‌రాజు చెప్పారు. ఈ చిత్రంలో పోసాని కృష్ణమురళి, విజయ రంగరాజు, పంచాగ్ని, దంతం రమేష్, ఖాజా, ఈశ్వరయ్య, చెన్నయ్య, సుధ, రవి గోగులపల్లి, హరిశంకర్, సునీత, అనిల్‌సాయి తదితరులు నటిస్తారు.

## మహోధృతంగా పాదయాత్ర!



గడప గడపకు వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీని తీసుకెళ్లాలని నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి నిర్వహిస్తున్న 141 రోజుల మహాపాదయాత్ర మరో పక్షం రోజుల్లో పూర్తి కానుంది. పాదయాత్ర ఇటీవల కొండాయపాళెం గ్రామంకు చేరుకొంది. ఈ సందర్భంగా గ్రామంలో జరిగిన ప్రచార సభలో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికలు జరగనిచ్చేదానికి అధికార కాంగ్రెస్‌పార్టీ ఓటమి భయంతో వెనకాడుతుందన్నారు. ఎప్పటికప్పుడు కుంటిసాకులు చెబుతూ ఈ ఎన్నికలను వాయిదా వేస్తుందని; న్యాయస్థానాన్ని సైతం తప్పుదారి పట్టిస్తుందని ఆరోపించారు. స్థానిక సంస్థల ఎన్నికలు జరగని కారణంగా కేంద్రం నుంచి రాష్ట్రానికి రావాల్సిన నిధులు ఆగిపోయాయని, స్థానిక ఎన్నికలు జరపనిదే నిధులు విడుదల చేయలేమని కేంద్రం స్పష్టంగా చెప్పిందని అయినా రాష్ట్ర ప్రభుత్వంలో చలనం లేదన్నారు. నెల్లూరు నగర కార్పొరేషన్ దరిద్రంగా తయారయ్యిందని, అధ్వాన్నపు పారిశుధ్యానికి రాజధానిగా దోమల స్వర్గంగా పేరుగాంచిందన్నారు. జంట ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డిలు అభివృద్ధిని మరచి ప్రచార ఆర్భాటాలకే పరిమితమయ్యారని విమర్శించారు. ఈ కార్యక్రమంలో మాజీ కౌన్సిలర్ మాథ్యూస్ ఎలీషా, సరళ, దేవదాసు, గంటా డేవిడ్, చిన్నా, మీనమ్మ, శీనయ్య తదితరులు పాల్గొన్నారు.

## స్వర్ణ సూక్ష్మ గణపతులు



వినాయక చవితి పండుగను పురస్కరించుకొని నగరానికి చెందిన స్వర్ణకారుడు షేక్.ముసవ్వీర్ సూక్ష్మ స్వర్ణ గణపతుల ప్రతిరూపాలను తయారు చేశారు. కేవలం ఒక గ్రాము 800 మిల్లీ గ్రాముల్లో సూర్య, చంద్ర, అంగారక, బుధ, బృహస్పతి, శుక్ర, శని, రాహు, కేతు రూపాల్లో తొమ్మిది విఘ్ననాధుల ప్రతిరూపాలను తయారు చేశారు. మూడురోజులపాటు శ్రమించి వీటిని రూపొందించారు. అతి సూక్ష్మ స్వర్ణ శయన గణపతి వంద మిల్లీ గ్రాములలోనూ, సూర్య గణపతి 250 మిల్లీ గ్రాముల్లో తయారు చేసినట్లు ముసవ్వీర్ చెప్పారు. ముసవ్వీర్‌లో అద్భుత కళాకారుడు దాగి వున్నా అతని చెంతకు లక్ష్మీదేవి ఇంకా దరి చేరకపోవడం విడ్డూరమనిపిస్తుంది.

## ఇనుప ఖనిజం దిగుమతి

జిల్లాలోని కృష్ణపట్నం ఓడరేవు నుంచి ఏడాది క్రితం వరకు విదేశాలకు ఇనుప ఖనిజం ఎగుమతి జరిగేది. దేశంలోని ఇనుప ఖనిజం వెలికితీతపై సుప్రీంకోర్టు నిషేధం విధించడంతో పరిస్థితి మారింది. దేశంలో ఇతర అవసరాల దృష్ట్యా తొలిసారిగా కృష్ణపట్నం ఓడరేవులో ఇనుప ఖనిజం దిగుమతి జరుగుతుంది. పరిశ్రమల అవసరాల రీత్యా దిగుమతి చేసుకోవాల్సి వస్తుంది. ప్రస్తుతం కృష్ణపట్నం ఓడరేవులో దక్షిణాఫ్రికాకు చెందిన నౌక ఇనుప ఖనిజం తీసుకు వచ్చింది. ఈ రేవులో నౌక నుంచి దింపిన ఇనుప ఖనిజాన్ని భారీ వాహనాల ద్వారా పలు ప్రాంతాలకు తరలించనున్నారు. గతంలో కర్నాటక రాష్ట్రం బళ్లారి నుంచి ఇనుప ఖనిజం తీసుకువచ్చే భారీ వాహనాల కారణంగా మన జిల్లాలో మర్రిపాడు దగ్గర నుంచి ముత్తుకూరు వరకు దాదాపు 500 కిలోమీటర్ల మేర రహదారులు పూర్తిగా దెబ్బతిన్నాయి. అంతే కాకుండా వెయ్యి మందికి పైగా ప్రమాదాలకు గురై దుర్మరణం చెందారు. ఇనుప ఖనిజం రవాణా జరగకపోవడంతో వాహనదారులు ఊపిరి పీల్చుకున్నారు. ఇప్పుడు ఖనిజాన్ని వాహనాల ద్వారా తరలించే అవకాశం ఉండడంతో వాహనదారులు ఆందోళన చెందుతున్నారు.



## రైతు లోకం — రబీకి అనువైన వరి రకాలు - సూచనలు!

జిల్లాలో అక్టోబర్ నెల నుంచి రబీ సీజన్ ప్రారంభమౌతుంది. ఈ సీజన్‌లో వ్యవసాయశాఖ అధికారులు, ఏరువాక కేంద్రం శాస్త్రవేత్తలు సూచించిన వరి రకాలను మాత్రమే రైతులు వరిపంటగా వేసుకోవాలి. అక్టోబర్ 15వ తేది వరకు బిపిటి-5204, ఎన్‌ఎల్ఆర్-3041, 22892, ఎడిటి-37, సిఆర్-1009 వరి రకాలను విత్తుకోవాలి. అక్టోబర్ 15వ తేది తర్వాత స్వల్పకాలిక రకాలైన ఎంటియు-1010, ఎన్‌ఎల్ఆర్-34449 రకాలను విత్తుకోవచ్చు.

నారుమడిని 10-12 రోజుల వ్యవధిలో మూడు దఫాలు దమ్ము చేసి చదును చేయాలి. నీరు పెట్టడానికి, తీయడానికి వీలుగా కాలువలను ఏర్పాటు చేసుకోవాలి.

5 సెంట్ల నారుమడికి రెండు కిలోల నత్రజని (ఒక కిలో విత్తనం చల్లే ముందు, మరో కిలో విత్తిన 12-14రోజులకు), ఒక కిలో భాస్వరం మరియు ఒక కిలో పొటాష్ నిచ్చే ఎరువులను దుక్కిలో వేయాలి. మొలక కట్టిన విత్తనాన్ని సెంటుకి 5 కిలోల చొప్పున చల్లుకోవాలి. జింకు లోపాన్ని గమనిస్తే లీటరు నీటికి 2 గ్రాముల జింకు సల్ఫేట్ ద్రావణాన్ని పిచికారి చేయాలి.

విత్తిన 10 రోజులకు మోనోక్రోటోపాస్ 1.6మిల్లీలీటర్లు లేక క్లోరిపైరిఫాస్ 2.5మిల్లీలీటర్ల చొప్పున లీటరు నీటికి కలిపి పిచికారి చేయాలి. నారు పీకడానికి ఏడు రోజుల ముందు సెంటు నారుమడికి 160 గ్రాముల కార్బోఫ్యూరాన్ 34 గుళికలు తక్కువ నీటిలో వేయాలి.

**డాక్టర్ కె.పుల్లంరాజు**
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.



Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14

### మృత్యు కబంధ హస్తమంటూ

# అమెరికాలో వాల్‌మార్ట్‌పై నిరసన!

8వ పేజీ కొరవ

సూపర్‌మార్కెట్ జెయింట్ల ప్రభావం వూహకు కూడా అందనంత ప్రగాఢంగా వుంటుంది. రైతుల నుంచి నేరుగా కొనుగోలు చేయడం వీరి వ్యాపార విధానం. అందుకోసం రైతులకు విత్తనాలు, ఆధునిక వ్యవసాయ పరిజ్ఞానం అందిస్తారు. కొత్తసాగు పద్ధతులు నేర్పిస్తారు. నాణ్యతా ప్రమాణాలు నిర్దేశిస్తారు. అవన్నీ భారీ ఖర్చుతో కూడుకొన్నవి. ఇప్పటి వలె సాదా పొలంలో కూరగాయలు పండిస్తే వీరు కొనరు. గ్రీన్‌హౌస్‌లో పెంచే మొక్కలనే ఎంచుకొంటారు. రంగు, రుచి, వాసనలలో మార్పు చేసిన హైబ్రిడ్, జెనెటిక్ విత్తనాలను వాడమంటారు. ఇప్పటి వరకు రైతులు పాటించే పద్ధతి, తమ పంట నుంచే కొంత భాగాన్ని విత్తనాలకు విడిగా పెట్టుకొని వాడుకోవడం. అందువల్ల వ్యవసాయ ఖర్చు తక్కువగా వుంటుంది. ప్రతిసారీ విత్తనాలను బహుళ జాతి కంపెనీల నుంచి కొనాలంటే, అధిక ధర చెల్లించాలి. అంతా బాగా నడిచి, పంట పండిస్తే ఫర్వాలేదు. తుఫానో, ఏ మాయదారి తెగులో వచ్చి పంట నష్టం కల్గితే ఇక ఆ రైతు కోలుకోవడం దుర్లభం. బిటి రకం పత్తి విత్తనాల మోజులో పడిన రైతులు ఎంతమంది ఆత్మహత్యలు చేసుకొంటున్నారో మనం నిత్యం పత్రికలలో చదువుతూనే వున్నాము. వాల్‌మార్ట్ రంగ ప్రవేశం చేస్తే సాధారణ వరి రైతు కూడా ఇంత భారీ నష్టం ఎదుర్కోవాల్సిన ప్రమాదం ఏర్పడుతుంది.

## అందుబాటులో సాంకేతిక పరిజ్ఞానం

అట్లని వాల్‌మార్ట్ ప్రవేశం వల్ల అన్నీ నష్టాలే అనుకోవడానికి లేదు. కొన్ని ప్రయోజనాలు కూడా వున్నాయి. మన రైతాంగం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్య – మార్కెటింగ్ వ్యవస్థ లేకపోవడం. టమోటాల వంటి త్వరగా పాడైపోయే కూరగాయల విషయంలో ఈ సమస్య తీవ్రంగా వుంది. పంట చేతికి


వాల్‌మార్ట్ సూపర్‌మార్కెట్‌లో పండ్ల విభాగం.

వచ్చేనాటికి మార్కెట్ లేకపోతే పొలంలోనే పారబోయాలి. ప్రతి రెండేళ్లకొకసారి కూరగాయల రైతులు ఈ సమస్య ఎదుర్కొంటున్నారు. ఎంతో నష్టపోతున్నారు. వాల్‌మార్ట్ వంటి సంస్థలు ప్రవేశిస్తే శీతల గిడ్డంగులు, ఎక్కువ కాలం కూరగాయలను నిల్వ చేసే సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులోకి వస్తాయి. దానివల్ల మార్కెట్ ఒడిదుడుకులను తట్టుకొనే అవకాశం రైతుకు లభిస్తుంది. రవాణా విషయంలో కూడా ఆధునిక మార్పులు వస్తాయి. నిమ్మకాయలు, మామిడి పండ్లు వంటి వాటిని దూర ప్రాంతాలకు రవాణా చేయడంలో ఇప్పుడు రైతాంగం ఎదుర్కొంటున్న సమస్యలు కొన్ని పరిష్కారమౌతాయి.

## రైతుకు గిట్టుబాటు ధర!

ప్రధాని చెప్పే మరొక ముఖ్యమైన ప్రయోజనం – మధ్య దళారీలు లేకుండా పోవడం. వాల్‌మార్ట్ వంటి సంస్థలు నేరుగా రైతుల నుంచే కొంటారు కాబట్టి, బ్రోకర్లు, కమీషన్ ఏజంట్లు, టోకు వర్తకులు... వంటి మధ్య దళారీల ప్రమేయం వుండదు. అందువల్ల రైతుకు గిట్టుబాటు ధర లభిస్తుందని ప్రధాని వాదన. అయితే ఇక్కడొక ప్రమాదం కూడా వుంది. మొత్తం మార్కెట్ వ్యవస్థ విదేశీ కంపెనీల చేతులలోకి వెళ్లినప్పుడు, వారిలో గుత్తాధిపత్య ధోరణి పెరుగుతుంది. తమకు అవకాశం దొరికినప్పుడు ధరలను తగ్గించి, రైతును చావు దెబ్బ తీయవచ్చు. రొయ్యల పెంపకం రైతులు ఇప్పటికే ఈ చేదు అనుభవాన్ని ఎన్నోసార్లు రుచి చూశారు. ప్రాసెసింగ్ కంపెనీలు ఒక కూటమిగా



వాల్‌మార్ట్ సూపర్‌మార్కెట్‌లో మందుల విభాగం.

ఏర్పడి, సరిగా రొయ్యలు పట్టే సమయంలో ధరలు పతనం చేయడం ఎన్నోసార్లు జరిగింది. ఆ గుత్తాధిపత్య ధోరణి ఇక నుంచి అన్ని రకాల వస్తువులకూ విస్తరించే ప్రమాదం వుంది.

దేశంలో పలు రైతాంగ సంఘాలు ఈ విదేశీ పెట్టుబడులను వ్యతిరేకిస్తుంటే, పంజాబ్ రైతులు మాత్రం తమకు కావాలని కోరుతున్నారు. అందుకు కారణం – వ్యవసాయంలో ఎప్పటికప్పుడు కొత్త ప్రయోగాలు చేసే అక్కడి రైతాంగంలోని ఔత్సాహిక తత్వం. విదేశీ కంపెనీలు రంగంలోకి వస్తే తమ ఉత్పత్తులకు అధిక ధరలు వస్తాయని వారి భావన. ప్రముఖ వ్యవసాయ శాస్త్రవేత్త డాక్టర్ ఎంఎస్.స్వామినాథన్ మొదట దీన్ని వ్యతిరేకించాడు. దీనివల్ల భారతదేశంలో వ్యవసాయ రంగం, గ్రామీణ ఆర్థిక వ్యవస్థ, రైతు బ్రతుకు చిన్నాభిన్నం అవుతాయని గట్టిగా వాదించాడు. కానీ పంజాబ్ రైతు సంఘాల భిన్న వైఖరి వల్ల ఆయన ఈ విషయంలో కొంత సానుకూలత వ్యక్తం చేస్తున్నాడు.

## సత్ఫలితాలు వచ్చేనా?

సూపర్ మార్కెట్లు అమ్మే వస్తువులలో అధిక భాగం వ్యవసాయ ఉత్పత్తులే కావడం, మనది ప్రధానంగా వ్యవసాయిక దేశం కావడం ఇక్కడ ప్రధానంగా గమనించవలసిన అంశాలు. పదేళ్ల క్రితం చంద్రబాబు నాయుడు కుప్పంలో ఇజ్రాయిల్ తరహా సేద్యం ప్రవేశపెట్టాడు. కానీ దాని వల్ల దుష్ఫలితాలు తప్ప సత్ఫలితాలు రాలేదు. ఇప్పుడు దేశం మొత్తం మీద వాల్‌మార్ట్ వంటి సంస్థలు అటువంటి ప్రయోగం చేస్తాయి. దానితో సాంప్రదాయ సేద్య విధానాలు అదృశ్యమైపోతాయి. అక్షరాస్యత లేని మన రైతాంగం దాన్ని ఎంతవరకు తమలో ఇముడ్చుకోగలరన్నది పెద్ద ప్రశ్న. అందులో ఏ పొరపాటు దొర్లినా కోట్లాది మంది రైతుల జీవితాలు భగ్నమైపోతాయి.



అమెరికాలోని వాల్‌మార్ట్ సూపర్‌మార్కెట్.

అయితే దురదృష్టవశాత్తు మన ప్రభుత్వాలు ఇందిరమ్మ ప్రారంభించిన హరిత విప్లవం తర్వాత వ్యవసాయ రంగంలో ఆధునిక పరిశోధనలు, ప్రయోగాలకు ప్రాధాన్యత ఇవ్వలేదు. అందువల్లనే మన దేశంలో ఎకరా పొలం నుంచి వచ్చే ఉత్పత్తి, అది ఏ పంట అయినా సరే, అతి తక్కువగా వుంది. భారతీయ వాతావరణం, ఆహారపు అలవాట్లు, సేద్యం పద్ధతులు, రైతుల ఆర్థిక స్థితికి తగిన కొత్త సాగు పద్ధతులు, హైబ్రిడ్ వంగడాల మీద విస్తృతస్థాయి పరిశోధనలు జరిపే బాధ్యత ప్రభుత్వం తీసుకొంటే విదేశీ పెట్టుబడులను పెద్దగా వ్యతిరేకించవలసిన అవసరం లేదు. కానీ ఏ చైనాలోనో, ఇజ్రాయిల్‌లోనో పాటించే పద్ధతులు, విత్తనాలు, పంటలు ఇక్కడి రైతుల నెత్తిన రుద్దితే మాత్రం ఫలితాలు ఘోరంగా వుంటాయనడంలో సందేహం లేదు.

ఇక్కడ మరొక అంశం కూడా వుంది. వాల్‌మార్ట్‌ను చూసి మనం భయపడినట్లే, మనల్ని చూసి వాల్‌మార్ట్ భయపడే పరిస్థితులూ వున్నాయి. పల్చటి నీరున్న చోట భయంకరమైన డ్రాగన్ కంటే, వేలంత

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com